**SRI PRABHAKARA PRAVACHANAMULU (Telugu)**

**“Sri Master CVV Yoga Saramu”**

7th February 2004

శ్రీ ప్రభాకర మిత్రమండలి ప్రచురణ

# శ్రీ ప్రభాకర ప్రవచనములు

**" శ్రీ మాస్టరు సి.వి.వి. యోగసారము"**




**శ్రీ ప్రభాకర మిత్రమండలి**

12 రాములవారి ఉత్తరమాడ వీధి, తిరుపతి - 517 507.

**2004**

Rs.25/-

శ్రీ ప్రభాకర మిత్ర మండలి ప్రచురణ

# శ్రీ ప్రభాకర ప్రవచనములు

## "శ్రీ మాస్టరు సి.వి.వి. యోగ సారము"




శ్రీ ప్రభాకర మిత్ర మండలి

12, రాములవారి ఉత్తరమాడవీధి, తిరుపతి 517 507.

2004

చతుర్థ ముద్రణ
2000 కాపీలు
7-2-2004

మాస్టర్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్.
గవర్నర్‌పేట, విజయవాడ - 2.
ఫోన్: +91(0)866 551 3151

**వెల:**

ప్రతులకు:

1. శ్రీ ప్రభాకర మిత్ర మండలి
   12, రాములవారి ఉత్తర మాడ వీధి, తిరుపతి 517 507.
   ఫోన్: +91 (0)877 222 8814
2. మాస్టర్స్ బుక్ సెంటర్
   155, బజారువీధి, తిరుపతి 517 501.
   ఫోన్: +91 (0)877 222 7785.
3. మాస్టర్స్ బుక్ సెంటర్
   266, ప్రకాశం రోడ్డు, తిరుపతి 517 501.
   ఫోన్: +91 (0)877 222 8538.

**First Printing 11th November 1981.**

# విషయసూచిక

Sri



**Sri Prabhakara Sastri and Smt.Mahalakshmamma**

పూజ్యపాదులు

శ్రీ

వేటూరి ప్రభాకర దంపతులకు

భక్తితో

యోగ మిత్రమండలి



అంజలి

# పూజ్య శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

జననం:7-2-1888 కృష్ణాజిల్లా పెదకళ్ళేపల్లిలో, తండ్రి: సుందరశాస్త్రి గారు, తల్లి: శేషమ్మ గారు. బాల్యంలో శ్రీ మద్దూరి రామావధానులు, శ్రీ అద్దేపల్లి సోమనాథశాస్త్రి గార్ల వద్ద సంస్కృత మభ్యసించారు. తమ 13వ యేట శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి గారి వద్ద సంస్కృతాంధ్రాలు, అవధానాలు అభ్యసించారు.

18వ యేట మదరాసులోని మిషన్ హైస్కూలులో తెలుగు పండితులుగా చేరి రెండు సంవత్సరము లా ఉద్యోగము నిర్వహించినారు. తదుపరి గవర్నమెంటు ఓరియంటల్ మ్యాన్యుస్క్రిప్టు లైబ్రరీలో తెలుగు పండితులుగా చేరి ప్రాచీన తాళపత్ర గ్రంథ పరిశీలనలోను, ఆంధ్ర సాహిత్య పరిశోధనలోను అగ్రస్థాన మాక్రమించినారు. మదరాసులో నుండగా నిర్విరామ కృషి వలన వారి ఆరోగ్యం చెడింది. ఎన్నెన్నో మందులు, మాకులు వాడారు. కానీ లాభం లేకపోయింది. చివరకు హరిద్వారం వెళ్ళి ప్రాణత్యాగం చేయాలనుకొన్నారు. ఆకస్మికంగా 1916వ సంవత్సరంలో శ్రీ పోతరాజు నరసింహం గారి సలహా మీద కుంభకోణం లోని శ్రీ మాస్టర్ సి.వి.వి. గారి ''భృక్త రహిత తారక రాజయోగం'' లో చేరి వారికి ప్రియశిష్యులయినారు. యోగమార్గం ద్వారా వారి ఆరోగ్యం చక్కబడింది. తదాది సాహిత్య గోష్ఠుల కన్నా యోగగోష్ఠుల వైపుకే మొగ్గసాగినారు. ఆధి వ్యాధులతో బాధపడుతున్న వారి నెందరినో ప్రతిఫలాపేక్షలేకనే యీ యోగమార్గము ద్వారా ట్రీటు చేసి ఆరోగ్యవంతులుగా నొనర్చినారు. ఎందరినో మృత్యుముఖము నుండి తప్పించిరి.

శ్రీ శాస్త్రిగారు నిత్యము ప్రార్థనవేళల్లో సశరీరంగా దర్శించి స్పృశించి, పలకరించి, ఆశీర్వాదాలు పొందినారు. ప్రపంచంలో శ్రీ మాస్టరుగారి రూల్సు రెగ్యులేషన్సు తప్పక పాటిస్తూ క్రమం తప్పకుండా, భక్తి శ్రద్ధలతో అతి జాగ్రత్తగా ప్రార్థించే మానవులంతా ఈ మానవ శరీరంతో ఎటర్నటీని సంపాదించాలనీ, తాము పొందిన అనుభూతిని పొందాలనీ ఎంతగానో తాపత్రయ పడ్డారు. వారి శిష్యులమైన మనమంతా శ్రీ మాస్టరు సి.వి.వి. గారు మనకంతా దర్శనమివ్వాలనే సత్సంకల్పంతో ప్రార్థిద్దాము రాండి. శ్రీ ప్రభాకర మిత్ర మండలి ప్రార్థన సమావేశాల్లో పాల్గొనండి– మీలో పేర్కొని పోయిన తప్పుడు భావాలను పారద్రోలుకోండి– బాగుపడండి– ఈ మానవ శరీరంతో ఎటర్నటీ సంపాదించుకోండి.

1940వ సంవత్సరం తిరుపతి శ్రీ వెంకటేశ్వర ఓరియంటల్ రీసెర్చి ఇనిస్టిట్యూటులో ప్రధానాంధ్ర పండితులుగా చేరి తుదివరకు ఆ యుద్యోగమును చక్కగ నిర్వహించినారు. తాళ్ళపాక అన్నమయ్య కీర్తనలను ప్రపంచానికి అందించినారు. అన్నమాచార్యోత్సవమును తిరుమల తిరుపతి దేవస్థానం వారు జరుపునట్లు ఏర్పాటు చేసినారు. విశ్వవిద్యాలయమును తిరుపతిలో ఏర్పాటు చేసినారు. తుదకు ఆ సంకలనంలోనే కనుమరుగైనారు.

కనుమరుగైన సమయం: 1950 ఆగష్టు 29, మధ్యాహ్నం గం॥12.30ని॥లు.

# ఒకమాట

అస్మద్గురుదేవులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వికృతినామ సంవత్సర శ్రావణ బహుళ విదియ మంగళవారము(29-8-1950) మధ్యాహ్నం గం॥12.30ని॥లకు నిర్యాణము చెందారు. సాయంకాలం గం॥6.00కు సంస్కారాదులు పూర్తి అయి స్నానాదులు ముగించుకొని మిత్రులంతా వస్తూ ఉండగా మిత్రులు శ్రీ కంభంపాటి సత్యనారాయణ శ్రేష్ఠిగారు---

''ఎంతోమంది శిష్యులున్నారు-శ్రీ శాస్త్రిగారు రచించిన రచనలు ఎన్నో వున్నాయి. అవన్నీ ప్రకటింపబడేటట్లు చూడండి. వారు అనుసరించిన యోగమార్గాన్ని కొనసాగించండి. ఇవి నా కోరికలు'' అన్నారు. ఆనాడే వారి సంకల్పబలం వల్ల ''యోగ మిత్ర మండలి'' అనేది ఏర్పడింది. అందులో సభ్యులుగా కొందరు చేరారు. మరికొందరు మరి మాకు యోగంతో సంబంధం లేదుకదా! మరి మేమేం చేయాలన్నారు. అప్పుడే, యోగంతో పరిచయం కలవారికై ''యోగ మిత్ర మండలి'' అనీ, శ్రీ శాస్త్రిగారితో పరిచయం కలవారికై ''శ్రీ ప్రభాకర మిత్ర మండలి'' అనీ, శ్రీ శాస్త్రిగారి రచనల యెడ అభిమానం కలవారికై ''శ్రీ ప్రభాకర పరిశోధక మండలి'' అనీ స్థాపించాము. అన్నీ శాస్త్రిగారికి సంబంధించినవే.

''మిత్ర మండలి'' అనే పేరు ఎందుకు పెట్టామంటే శ్రీ మాస్టర్ సి.వి.వి. గారు''యోగ ఫ్రెండ్సు సొసైటి'' అనే పేరు పెట్టారు వారు స్థాపించిన భృక్త రహిత తారక రాజయోగ సంస్థకు. అందుకనుగుణంగా, మా గురుదేవులు వారివద్ద చేరిన వారినందరినీ మిత్రులనే పిలిచేవారు- చెప్పేవారు. ఆ భావాన్నే ''ప్రజ్ఞా ప్రభాకరం'' మొదట్లో కూడా వ్రాశారు చూడండి.

''మిత్రగోష్ఠిలో విన్నవించుకొనుట కొఱకే నా యీ గ్రంథరచన ప్రయత్నము.''

''మిత్రమండలి పేరనే శ్రీ గురుదేవుల రచనలు అయిదారు ప్రకటింపబడి

ప్రసిద్ధినీ, ప్రాచుర్యాన్నీ చూరగొన్నాయి''.

ఈ మధ్య ఒకరోజు ప్రార్థన సమావేశంలో ''ప్రభాకర ప్రవచనాలు'' చదువుతూ ఉండగా మిత్రులంతా తమకు పుస్తకాలు కావాలని అడగడం ప్రారంభించారు. పుస్తకాలు లేవన్నాము. యోగమునందు ప్రగాఢ విశ్వాసము- శ్రీ శాస్త్రిగారి యెడ భక్తి ప్రపత్తులు చూపడానికై 'యోగప్రభా పబ్లికేషన్సు' అను పేరుతో ఒక సంస్థను స్థాపించి- ద్వితీయ కుసుమంగా ఈ 'ప్రభాకర ప్రవచనాలు' ద్వితీయ ముద్రణం చేయడానికి శ్రీ పబ్బతి యెరికలయ్యగారు తలపెట్టినారు (లాభ నష్టాలతో పనిలేకుండా) పుస్తకానికి ఎంత ఖర్చు అవుతుందో అంత పెట్టుబడి పెట్టి- తిరిగి రాబట్టుకోవాలి గానీ లాభం దృష్టితో అచ్చు వేయరాదని నిర్ణయించి- ప్రారంభించాం.

మిగిలి ఉన్న శ్రీ గురుదేవుల రచనలన్నీ మిత్రుల సహాయ సహకారాలతో ఇదే విధంగా త్వరలో వెలువరింపబడగలవని ఆశిస్తున్నాను.

మిత్రులు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు ''చాటు పద్య మణి మంజరి'' పీఠిక(1952 ప్రచురణ-2 వ భాగం)లో---

''పూజ్యులు శ్రీ ప్రభాకరశాస్త్రిగారి యితర రచనలను కూడా యథోచిత రీతిని గ్రంథరూపమున బ్రకటించి పుణ్యము కట్టుకొందురుగాక యని ఈ మిత్రమండలి వారిని కోరుచున్నాను.'' అన్నారు.

గురుదేవులు శ్రీ ప్రభాకరశాస్త్రిగారి రచనలు మిత్రమండలి ప్రకటించాలనీ- ప్రకటిస్తారనీ ఆశిస్తున్న విద్వల్లోకమునకు ఆశాభంగం కలగకుండా చూడవలసిన బాధ్యత మిత్రమండలిపై ఉన్నదని మనవి చేస్తున్నాను.

గురువును మించిన శిష్యులుగా తయారు చేయాలనే సత్సంకల్పంతో ఉండేవారు శ్రీ శాస్త్రిగారు. శ్రీ శాస్త్రిగారు క్లాసులోనికి రాగానే- ''లాచి పరాంగనల్ వర విలాస మనోహర రూప సంపదన్ చూచిన చూడడుత్తముడు తా చూచిన చూచును మధ్యముండు, తా చూచిన చూడకున్న చూచు

నథముండు వీరిలో తా చూచిన చూడకుండు ఘృణి చూచు విధంబున చూడు మంబికా'' అని చెప్పి విద్యార్థులంతా శీలవంతులుగా ఉండాలని చదివేవారు. అక్షరాలు గుండ్రంగా వ్రాయాలనేవారు- ''వ్రాలివిగో కనుంగొనుము వన్నియ మీరగ వ్రాలకేమి నా వ్రాలు వజ్రాలు సుధారసాలు కవిరాజుల కెల్ల మనోహరాలు'' అన్న విధంగా వ్రాత ఉండాలనేవారు. అట్లా తీర్చిదిద్దినారు మమ్మల్ని శ్రీ ప్రభాకరశాస్త్రిగారు. వారి ఋణం తీర్చవలసిన బాధ్యత శిష్యుల మీద ఉంది. తీర్చేవారు తీరుస్తున్నారు. లేనివారు వేగబాండ్ల లాగా తిరుగుతున్నారు.

శ్రీ ప్రభాకర ప్రవచనాలను కంప్యూటర్‌లో అచ్చుకు సిద్ధము చేసియిచ్చిన యోగమిత్రుడు చిరంజీవి పబ్బతి యోగానందగోపాలునికి ఆయురారోగ్య ఐశ్వర్య యోగ వ్యాపారాభివృద్ధులను కలిగించాలని శ్రీ మాస్టరు సి.వి.వి. గారిని, గురుదేవులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారిని ప్రార్థిస్తున్నాను.

సకాలంలో సర్వాంగ సుందరంగా ఈ 'శ్రీ ప్రభాకర ప్రవచనాలు' అచ్చువేసి వూకందించిన మాస్టర్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్ ప్రొప్రైటర్, యోగమిత్రులు శ్రీ బాదర్ల దేవదాసు వారికి ధన్యవాదాలర్పిస్తున్నాను.

భృక్త రహిత తారక రాజయోగ మాస్టర్ల ఆజ్ఞా పాలకుడు.

ఎ.వి. శ్రీనివాసాచార్యులు(సీ.సా.)

శ్రీ మాస్టర్ సి.వి.వి. యోగ సెంటర్(బ్రాంచి)
శ్రీ ప్రభాకర మిత్ర మండలి
నెం. 12, రాములవారి ఉత్తర మాడ వీధి,
తిరుపతి-517 507.
టెలిఫోన్:- 222 8814; సెల్ ఫోన్: 98494 67303.
వెబ్‌సైట్: www.mastercvv.org.
ఇ-మెయిల్:- avsacharyulu@rediffmail.com

## తొలిపలుకు

తపోధనులు శ్రీ శాస్త్రిగారు ప్రార్థనానంతరం వారికి ప్రధానంగా గోచరించే విషయాలగూర్చి ప్రసంగం ఆరంభిస్తారు. ప్రసంగవశాత్తు ఎన్నో సంగతులు దొర్లుతాయి. తమ యెదుట ఉన్న పూలు, పండ్లు మొదలగు వస్తువుల గూర్చి, ట్రీటుమెంటుకు వచ్చిన వ్యక్తుల సైకాలజీని గూర్చి– ఇల్లానే శ్రీవారు ఎన్నెన్నో విషయాలు వివరిస్తూ వుంటే ''శిశుర్వేత్తి పశుర్వేత్తి'' అన్నట్లుగా మేము చెవులప్పగించి వింటూ వుండేవాళ్ళం.

అలావినటం– గ్రీష్మఋతువులో యెండిన పూలతోటపై వానజల్లు పడుతూంటే–ఎంతో ఆప్యాయంగా, తలలువంచి తూగుతూండే పూలమొక్కలు జ్ఞాపకానికి వస్తూంటాయి. అలా అచటి వారంతా కూర్చుండేవారు. ఎవరికీ మరేలాటి ఆలోచనలు, సాలోచనలు సాగేవికావు. అలా ఊరక వింటూండడమే. ప్రతి ప్రసంగంలోను ఛలోక్తులు విసరేవారు. అవి చక్కిలిగింతలు పెడుతూండేవి. మధ్యాంధ్ర దేశపు వరిపొలాలు, నిమ్మతోటలు, కొబ్బరితోపులు వర్ణిస్తూ వుంటే మా గ్రామాలలో మరల మరలా తిరుగుతూన్నట్లు అనిపించేది. ఆ ప్రాంతపు విందుభోజనపు యేర్పాట్లను వర్ణిస్తూంటే నోరూరేది. వర్షఋతువులో కృష్ణా గోదావరీ స్రవంతుల వరద పొంగుల వర్ణిస్తూ వుంటే శరీరానికి ఆ చల్లదనం తగిలినట్లుగా గగుర్పొడిచేది.

ఈ వర్ణనలతో గూడిన ప్రసంగాల వెనుక ఏదో ఒక దివ్యబోధ నిలిచి వుండేది. ఆ ఛలోక్తుల వెనుక మనలోని దొసగులకు ఒక కొరడా దెబ్బ తగిలినట్లు వుండేది. అది పై చర్మాన్ని, అస్థికలను దాటి యెక్కడో చురక అంటించేది. మనసులను చక్కదిద్దేదిగా వుండేది. ఎన్నెన్నో చీకాకుల తోటి, చింతల తోటీ వచ్చేవారంతా వాటిని మరచి అచట కూర్చుండి వినేవారు. ''తలంటి నీళ్ళు పోసిన పిదప ఆ చిరాకు వల్ల ఏడ్చే బిడ్డను తల్లి ఒడిలో పరుండ బెట్టుకొని పాలిస్తూ, జోలపాట పాడుతూ, తల చిక్కు దువ్వుతూంటే పిల్ల ఎంతో

హాయిగా కళ్ళు మూస్తుంది''. అట్టి స్థితి గుర్తుకొచ్చేది ఆ స్థితి. ప్రసంగం పూర్తి కాగానే యిళ్ళకు వెళ్ళడానికి లేస్తారు. ''ఏం నాయనా! సుఖంగా ఉన్నావా?'' అని ప్రతి ఒకరిని ఆదరంతో అడుగుతూ వుంటారు. అనారోగ్యాలతోను, పథ్యపు తిప్పలతోను బాధపడుతున్న వాళ్ళు ''ఇప్పటికి సుఖంగానే ఉన్నాము కానీ'', అని ఏదో అనబోతూండగా ఆమాట కట్టిపెట్టండి, మీకేం భయంలేదు–అదంతా నా నెత్తిన వేసి సుఖంగా ఇంటికి వెళ్ళి ఆవకాయ, పప్పు, మంచి పులుసు, గట్టి పెరుగు వేసికొని సుఖంగా భోంచేయండి. అన్నీ సర్దుకొంటాయి, అంటారు. మరలా అంతా ఘొల్లున నవ్వుతారు.

అజీర్ణపు రోగి కూడా నోరూరి అలానే బాగా భోజనం చేయాలనే ఉత్సాహంతో బయలు దేరుతాడు. ఏవో సంసారపు చీకాకులు గల గృహస్థు త్వరగా యింటికి వెళ్ళి భార్యను మంచి చేసుకొని ప్రేమతో లాలించా లనుకొంటాడు. తండ్రితో తగాదా పడ్డ కొడుకు యింటికి వెళ్ళగానే ఏం నాన్నా! అంటూ తండ్రితో కలిసి పోవాలనుకుంటాడు. అక్రమంగా ప్రక్కవారిని హింసించాలనే పెద్దమనిషి మారి స్నేహాన్ని సంపాదిద్దా మనుకొంటాడు. ఇలా అనుకొంటూ మెట్లు దిగిపోతారు వారు.

వారు సెలవిచ్చేదంతా వినటమే కాని, యథాతథంగా రికార్డు చేయడం జరగలేదు. తన్మయులమై వింటూవుంటే ఆ విషయాలను కాగితంపై బరబరా రాయడం కూడా అపచారమే అనిపించింది. అలా సమగ్రంగా ఎవరూ వ్రాయలేదు. అడపాదడపా కొన్ని విషయాలు పొడి పొడి వాక్యాలుగా మాత్రం యోగమిత్రులు రికార్డు చేయడం జరిగింది. అలాంటి పొడి పొడి వాక్యాలు ఆధారంగా మేము యీ ఉపన్యాసాలను సిద్ధపరిచాం. అందువల్ల పాఠకులు– ఇవి శ్రీ శాస్త్రిగారి రచించిన వాక్యాలు కావని గుర్తుంచు కోవాలి. విషయాలు వారు చెప్పినవే. రచన యోగమిత్రులది. ఇందలి దోసగులు వారికంటవు.

––కొత్త రామకోటయ్య.

## సి.వి.వి. నమస్కారము

శ్రీ నిరంతరానంద నిశ్రేయ సార్ధ
సాధకము సర్వకిల్బిష బాధకము స
మగ్ర విజ్ఞానదము మహామహిమ ఘనము
శరణమగు మాకు సద్గురు చరణయుగము.

ఆకుచిల్కలు తెక్కలల్లార్చి యాడుచో
బువ్వుల్ గుభాళించి నవ్వుచోట
పక్షులతో వృక్షపటలి వెల్విరియుచో
జంపతుల్ వాహ్యాలి సల్పుచోట
జలజల సెలయేళ్ళు జాల్వారి దొరలుచో
నదులు సంద్రములతో గదియుచోట
ఏకాగ్రవృత్తి యోగీశ్వరుల్ వెలయుచో
నద్రి శృంగములు మిన్నందుచోట

పుడమికి గుడారుగా మిన్ను పొలుచు చోట
నాకసము భూమి యంటిసలాడుచోట
నీ మహత్వంబు దిలకించి నామనస్సు
చొచ్చు లోలోని కెచ్చటో చొక్కు దక్కు.

వే. ప్రభాకరశాస్త్రి

## శ్రీ ప్రభాకర మిత్ర మండలి ప్రచురణలు

### ఇంగ్లీషులో

| | | | |
|---|---|---|---|
| 1. మాస్టరు సి.వి.వి. గారి 22 డైరీలు (ఒకే వాల్యూంలో) (పేజీలు 490) | | – | రూ. 250.00 |
| 2. సి.వి.వి. నోట్సు | వాల్యూం 1 | – | రూ. 50.00 |
| | వాల్యూం 2 | – | రూ. 50.00 |
| | వాల్యూం 3 | – | రూ. 50.00 |
| | వాల్యూం 4 | – | రూ. 50.00 |
| 3. ప్లానెటరీ లీడింగ్ నోట్సు | | – | రూ. 50.00 |
| 4. మహాత్మ లెటర్స్ | వాల్యూం 1 | – | రూ. 100.00 |
| | వాల్యూం 2 | – | రూ. 100.00 |
| | వాల్యూం 3 | – | రూ. 150.00 |

### తెలుగులో

| | | |
|---|---|---|
| 1. ప్రజ్ఞా ప్రభాకరము (శ్రీ వే. ప్రభాకరశాస్త్రిగారి రచన) | – | రూ. 25.00 |
| 2. ప్రభాకర ప్రవచనాలు (సి.వి.వి. యోగ సారము) | – | రూ. 25.00 |
| 3. భృక్త రహిత తారక రాజయోగము (ప్రశ్నలు – సమాధానాలు)(శ్రీ ఎ.వి. శ్రీనివాసాచార్యులు గారి రచన) | – | రూ. 50.00 |
| 4. భృక్త రహిత తారక రాజయోగము (బుక్‌లెట్(తెలుగు, తమిళం, కన్నడ, హింది, ఇంగ్లీషు)) | – | రూ. 10.00 |

1

# 1. శ్రీ శాస్త్రిగారితో ఓరోజు

త్రికరణ శుద్ధిగా భవదధీనుడనై యితర ప్రవృత్తి వీ
డికొని పరార్థ లాభముకటే గమనించుచు నుందు, నింక మా
యికము ధనాధికమ్ము గణియింపను, సత్య దయోపకార సా
ర్థకమగు నాత్మచింతన పథంబును దప్పి చరింప నీశ్వరా!

గురుచరణారవిందములకున్ బ్రణమిల్లి తదీయ సత్కృపా
భరపరిసంస్కృతంబులగు భావములన్ వెలయించి తత్త్వవి
స్ఫురణము లోకమందు బరిపూర్ణము కాగల దన్న వేడ్క పొం
పిరిగొన జెప్పెదన్ నిజము పెంచి సమంచితమైన సత్కృతిన్.

పొరుగూరు నుండి శ్రీ శాస్త్రిగారి దర్శనార్థం వచ్చే వారిలో కొందరు సాధారణంగా వారి యింట్లోనే బస చేస్తూంటారు.

ఉదయం ఆరు గంటలయింది. నేను అప్పుడే నిద్ర నుండి లేచాను. చూస్తే అప్పటికే శాస్త్రిగారు లేచి మంచం మీద కూర్చున్నారు. 'ఏం నాయనా! తక్కినవాళ్ళు యింకా లేవనేలేదు-లేపకు. కొంతసేపుంటే వాళ్ళే లేస్తారు' అని పలకరించారు. వారి మాటలు విని తక్కిన వారంతా లేచారు.

బాగా పొద్దెక్కినట్లుగా ఉంది. రాత్రి సరిగా నిద్ర పట్టలేదయ్యా. ఎవరో తేలు కుట్టిందని వచ్చారు. వాళ్ళకు ట్రీటుమెంటు చేశాక, మంచం మీదవాలితే- ఏవో ఆలోచనలు, ముందర మనలైను ఎలా వర్కౌటవుతుందో అంటూ.

ఏమయ్యా! రాత్రి మీకు నిద్ర బాగా పట్టినట్టుంది- ఉండండి. ఇప్పుడే ముఖం కడుక్కొని వస్తా' అని లేచి వెళ్ళారు. మేమంతా మేడ దిగివచ్చి కాలకృత్యాలు తీర్చుకొని, కాఫీ వగైరాలు సేవించి వచ్చాము. అప్పటికి వారు పడక కుర్చీలో వాలి పేపరు చదువుతున్నారు. ఇంతలోకి అమ్మగారు కాఫీ

పట్టుకొచ్చారు. 'ఏమే! ఒట్టి కాఫీ త్రాగితే మంచిదంటావా?' 'ఎవరన్నారు పోనీ ఇడ్లీలు కూడా తినండి.' అంటూ అవి కూడా తీసుకొచ్చి యిచ్చారు వాటిని తీసుకొంటూ ఈ అరవవాళ్ళు చాలా ఘటికులు. ఎంతో మెత్తగా రుచిగా, పట్టుకుచ్చులా తయారుచేస్తారు. మనవాళ్ళకు ఇటువంటివి చేతకావు. చల్ది అన్నం, ఆవకాయ తప్పితే యింకేం చేతవుతుంది... అని.

నా వేపు చూసి–ఇవాళ ఎన్ని ఇడ్లీలు తిన్నావయ్యా? అన్నారు.

నేను సమాధానం చెప్పా. అంతేనా! ఇంకా ఒకటికి రెండు తగిలిస్తూ ఉండు–

ఏమండీ సార్! బొత్తిగా చల్లారి పోయిందే కాఫీ– కాస్త వెచ్చబెట్టి యిప్పిస్తారూ? అని, నాతో 'ఏమయ్యా! భార్యను యేమండీ అని పిలవవచ్చా? మగాళ్ళని సార్– అంటారు గదా ఆడవాళ్ళని సార్ అనాలా, సారిణి అనాలా– అన్నారు ఛలోక్తిగా, ఇంతలో కాఫీ వచ్చింది. త్రాగుతూ అబ్బే– చక్కెర తక్కువయిందే కాస్త...' లోపల నుండి అమ్మగారు చక్కెర తెచ్చారు.

'ఏం కోపంగా ఉన్నారు. ఇన్ని సార్లు తిరగాల్సి వచ్చిందనా, చూచావటయ్యా!' అన్నారు.

అమ్మగారు నవ్వుతూ– మళ్ళీ ఇంకా పాలు కావాలనీ లేకపోతే డికాషన్ తక్కువయిందనీ చెప్పండి. ఇప్పుడే పట్టుకొస్తా.

'ఎక్స్క్యూజ్‌మీ సార్– ఏమీ అక్కరలేదు. కాఫీ చాలా ఫస్టుగా ఉంది' అన్నారు.

కాఫీ తీసుకొని రెండు నిమిషాలు పేపరు చూస్తూ– 'అరే, నిన్న రాత్రి ట్రీట్‌మెంటుకు(తేలుకుట్టి) వచ్చిన వాళ్ళ అమ్మాయికి ఎలావుందో తెలియలేదయ్యా?' అంటే 'సరే నేను చూసివస్తానండీ– అంటూ మాలో ఒకరు లేచి వెడుతూంటే 'ఎందుకులే మీకా శ్రమ, వాళ్ళే వస్తారులే!', 'అబ్బే ఎందుకండీ వెళ్ళొస్తా'. 'సరే త్వరగా రావయ్యా! మీరు లేకపోతే నాకేం తోచదు. అందులో ప్రాక్టీసుకు టయిము అవుతూంది' అన్నారు.

# 3

అప్పటికి 7 గంటలు అయింది. ఒక్కొక్కరే ప్రార్ధనకు వచ్చే మిత్రులు రాసాగారు. వారిని వేరువేరుగా క్షేమాలడిగారు. ఇంతలో చిన్న పిల్లవాడు లోపల అల్లరి చేస్తున్నాడు. అది విని ఏమిటే ఆ గోల ప్రేయరు చేసికొందా మంటే ఒకటే గోల. వాణ్ణి ఇలా తీసుకురా!' అంతలోకి నేను రెక్క పుచ్చుకొని వాణ్ణి లాక్కొచ్చాను.

ఏమిటిరా నీఅల్లరి? నిజం చెప్పు, కొట్టను నేతిగిన్నె ఒలకపోశావా? లేకపోతే- ఏంపడేశావు?

''నన్ను తమ్ముడు కొడుతూంటే -వాడిచేతిలో కర్ర లాక్కున్నానండి. అంతే- నేనేం చేయలేదు'' -అన్నాడు.

సరే-మంచివాడవురా! నిజం చెప్పావు కనక నిన్నేం చేయను. తాతగారికి నమస్కారం చేసుకో.

అందరం ప్రేయరు చేసుకొన్నాము. నేనూ, ఆనందు పోస్టాఫీసుకు వెళ్ళి ఉత్తరాలు పట్టుకొచ్చాము. లోపలకు వెళ్ళి కళ్ళద్దాలు కోసం రెండు నిమిషాలు శ్రమపడి తీసుకొచ్చి వారికిచ్చాను. ఈలోగా వారు అడ్రసుల మీద దస్తూరీని బట్టి కొన్ని ఎక్కడనుంచి వచ్చినవి చెప్తూ- ఏమోయ్ జాగ్రత్తగా గమనిస్తే మనకెన్నో సంగతులు తెలుస్తాయి. ఆ వ్రాసినవాని కారెక్టర్ వ్రాసేటప్పుడు అతని మానసికమైన స్థితి చక్కగా గుర్తించవచ్చు. మనిషిలో దుడుకుతనం, సరసత్వం కూడా దస్తూరీనిబట్టి మనం కనిపెట్టవచ్చు అన్నారు. ఆ ఉత్తరాలు చూస్తూ పాపం! ఈయన అపుడే రెండు ఉత్తరాలు రాసాడు. వాటికి సమాధానం రాయలేదు. వాళ్ళబ్బాయి శరీరంలో బాగాలేదట! సరే- ఆ కుఱ్ఱవానికి జ్వరం తగ్గాలని నమస్కారం చేద్దాం. అంటూ వచ్చిన జాబుల సంగతులను గూడా వివరించారు. ఇంతలోకి టయిము 8, 8½ అయింది. స్నానానికి లేవబోతూండగా-

ఆఫీసు నుండి ప్యూను వచ్చి తాళ్ళపాకవారి సంకీర్తనల తాలూకు ప్రూఫులు పట్టుకొచ్చానని అన్నాడు. 'ఏవయ్యా?', వాడు బిత్తరపోతూ, సంగీత ప్రూఫులు తీసుకొచ్చానండీ, త్వరలో దిద్దియిస్తే...' సరేలే- నావైపుకు తిరిగి 'ఏవిటయ్యా! ఈ బాదర బందీ అంతా, ఈ ప్రూఫులు ఊరికే ముడ్డిమీద తన్నుతున్నాయి. ఆఫీసుపని అంతకన్నా అడ్డంగా వుంది మనకు కావలసింది యిదేనా? మనం కోరతగింది ఎక్కడో ఉంది. ఛఛా... ఈ పెధవ ఉద్యోగం మానేస్తాను' అన్నారు.

వచ్చిన జవాను తెల్లబోయి బిక్కముఖం వేసి 'స్వామీ నాకేం తెలియదండీ! ఆ మేనేజరు గారిమ్మన్నారు. లేకపోతే రేపు తీసుకొస్తాలెండి' -అన్నాడు.

'అబ్బెబ్బె! నిన్ను కాదు. నువ్వు చాలా మంచివాడవు. నిన్నేమీ అనలేదు. మా గొడవ వేరు. నీవు టిఫిన్ చేసిరా. నేను ఇంతలో దిద్ది యిస్తాను. నీ ఆరోగ్యం బాగుందా? నీవు అంతా చూస్తున్నావు కదా! ఖాళీ ఎక్కడుంది' అంటూ, నాతో- 'ఏమోయ్ ఆనక వచ్చింతర్వాత దీని సంగతి జ్ఞాపకం చేయండి. కూర్చోండి. నేనిప్పుడే స్నానం చేసి వస్తా' అంటూ లేచారు.

లేచి ''అరెరె! మరచా- కర్నూలు నుండి ట్రీటుమెంటుకని ఉదయం వచ్చిన వారేరి? ఆయన ఏమయినా అరేంజిమెంట్సు చేసుకొన్నారో లేదో? కనుక్కోవడం మరచాను! ఆయన ఎక్కడున్నారు?'' ''ఇక్కడే బయట బెంచి మీద కూర్చున్నారండీ'' అన్నాము. వారిని లోనికి పిలచాము.

ఏమండీ! క్షమించండి! ఇందాక నుండి మీ సంగతి కనుక్కోలేదు ఏదో గొడవల్లో పడి. ఈ ఊళ్ళో మీకెవరైనా బంధువులున్నారా? బసయెక్కడ? తిండి తిప్పలెలాగ?'' అన్నారు. ఆయన ''ఇక్కడ నేనెవరినీ ఎరగను -అట్టే డబ్బు గలవాణ్ణికాను. మీ పేరువిని యీబాధ భరించలేక, ఏదో పది రూపాయలుంటే రైలెక్కి వచ్చాను'' అన్నాడు.

5

వెంటనే లేచినవారు కూర్చొని సరే యీపూటకు మా యింట్లో భోజనం చేయండి. అంతదూరం నుండి వచ్చారు. పాపం! మీకు సదుపాయాలు ఎలా కుదురుతాయో?'', అపుడు నా ప్రక్కనే నిలిచి ఉన్న రావుగారు- 'దానికేమండి ఆయనగారు మాయింట్లోనే భోజనం చేస్తారులెండి. వారికి కావలసిన సౌకర్యాలు నేనే చూస్తాను.' అన్నారు. శాస్త్రిగారు చాలగా సంతోషించి 'అరే చూడండయ్యా! ఈశ్వరశక్తి ఏలాగున పనిచేస్తుందో- అణాకాని మనుషులం మనవల్ల యేమవుతుంది?' అంటూ... రావుగారి వైపు తిరిగి ''మీరు చేసినపని చాలా బాగుంది. మీరు ఇతరుల క్షేమం కోరుతున్నారు. కాన మీకూ క్షేమం కలుగుతుంది. చాలా సంతోషం నాయనా!'' అంటూ, ఆయన వీపు చేత్తో తట్టి గడియారం వైపు చూచారు. 'అబ్బ! చాలా టయిం అయిందే. మీరు కొద్దిసేపు కూర్చోండి. క్విగ్గా ఫైవ్ మినిట్సులో స్నానం చేసివస్తా' అంటూ లోనికి వెళ్ళి స్నానం చేసి వచ్చారు. వస్తూనే ''అయ్యో! పాపం ఆ పిల్లకు ఎలావుందో? ఇప్పటికే చాలా ఆలస్యం చేశా. ఇప్పుడే వెళ్ళి చూచివద్దాం' అంటూ బయట మెట్లవరకు వచ్చారు. అక్కడ ఆగి- అరే సీ.సా. చేతికర్ర పట్టుకురారా అన్నారు. అబ్బే! అదేం కర్రరా. నీ ముఖంలాగుంది. బాగాలేదు. ముక్త్యాల నుండి వచ్చిన కర్ర పట్టుకురారా!'' తరువాత ఆ అమ్మాయిని చూచి వచ్చాం. చాలా కులాసాగా, ఆరోగ్యంగా ఉంది. తిరిగి యింటికి వచ్చేటప్పటికి 11గం॥ అయింది. ఇంతలోకి ఓ కవీశ్వరుడు వాకిట్లో బెంచీ మీద కూర్చున్నాడు. శాస్త్రిగారిని చూడగానే లేచి భక్తితో నమస్కరించాడు. 'ఎవరునాయనా మీరు? మిమ్మల్ని చూచినట్టు గుర్తులేదు. చూచినా మరచానేమో? క్షమించండి. ఏదో పెద్దవాణ్ణి'- అన్నారు. ఆయన తనపేరు చెప్పి- 'కృష్ణావతారం' అనే కావ్యం రాశాను. అది తమకు వినిపించి- తమ అభిప్రాయం ప్రకారం సరిదిద్దు కొందామని వచ్చాను. నేను తమర్ని యిదివరలో చూడకపోయినా-తమ రచనల ద్వారా...

'సంతోషం నాయనా! మీ పుస్తకాన్ని కాస్త సావకాశంగా చూసి నాకు వీలయినప్పుడు అభిప్రాయం వ్రాసి పంపిస్తా, ప్రస్తుతం నాకు ఆఫీసు గొడవల్లో తీరికలేదు' అని వారు వ్రాసిన పుస్తకం తీసికొని వారిని పంపివేసారు. ఆ పుస్తకము పరికించి, ఒట్టి కల్లబొల్లి కబుర్లు. రాసేవన్నీ పచ్చి అబద్ధాలే కదా! రాస్తే నూటికి నూరుపాళ్ళు సత్యమయమయిందిగా, పవిత్ర మయిందిగా ఉండాలి.

పరుస పువ్రాత, కక్రమ పువ్రాత, కసత్యపు వ్రాత కెందు నా
కరమునకుం బ్రసర్పణము కల్గక యుండుత సత్యమైనదే
సరసము నైనదే రచన సల్పెద గాక యటే ఘటింపగా
గురుచరణారవిందములకున్ బ్రణమిల్లితి బాసచేసితిన్.

ఇటువంటిది ఎందుకు? అందులోకి కృష్ణావతారమట!– అంటూ ఒరేయ్ పుస్తకం అంటే జ్ఞాపకం వచ్చింది. ఒరే సీ.సా. ఆ సైకిలేసుకొని షికార్లు కొట్టకపోతే యీ ప్రూఫులు దిద్దరాదటరా? ఒడలు వంచి పని చేయరా–చేస్తే మంచి రచన అలవడుతుంది. అలా గాలికి తిరిగితే గాలికే పోతారు.' అని, 'ఏరా కోపం వచ్చిందా? నీ మంచికే.'

సీసా ఏం మాట్లాడకుండా ఆకర్ణాంతంగా నవ్వుతూ పెన్సిలు, ప్రూఫులు తీసికొని కూర్చున్నారు.

కూర్చోండి. మనలో ఈ చీకాకులు అన్నీ సర్దుకొని చల్లగా తియ్యగా మాస్టరుతత్వం పనిచేయాలని కోరుకొని నమస్కారం చేయండి' అన్నారు. రెండు నిముషాలలో ఎండలో తిరిగిన బడలిక అంతా మాలో సర్దుకు పోయింది. 'గోయిందా! సీసా అప్పుడే నిద్రపోతున్నాడా? సరే ఇపుడుత్సాహంగా ఉంది. సాహిత్యానికి సంబంధించిన పనులెన్నో ఉన్నాయి. ఇపుడు చేద్దామటరా!' అన్నారు. మీ యిష్టం అని లేచి నేను పుస్తకాల బీరువా

ప్రుకు వెళ్ళా. అంతలో అమ్మగారు భోజనానికి లెమ్మన్నారు.

పుస్తకాల సంగతి ఆనక చూద్దాంలే– అని 'సరే! వస్తున్నాను' అంటూ– టూన్లు నుండి వచ్చిన వారితో 'బాబు! మీరు మడి కట్టుకోండి. నాకంత ట్టింపు లేదు. నేను జాతి వివక్షతలు పాటించను. మీరు లోపలే మడిగా భోంచేయండి. నేను వీళ్ళతో భోంచేస్తాను. ఏమే ఆయనకు మడిగా లోపల డ్డించు' అంటూ– వారితో 'ఏమండీ! మీదేశం పరిస్థితులెట్లున్నాయి? క్రొత్త కం కాయకూరలు మీ ప్రాంతంలో ఏమయినా దొరుకుతాయా? వింత వింత వస్తువులూ, మంచి అందమయిన రాతి విగ్రహాలూ దొరుకుతాయా? పూర్వపు తాటాకు పుస్తకాలేమయినా దొరుకుతాయా? అవి పనికిరాక సాధారణంగా యేచూరులోనో పడేసి ఉంటారు. ఉంటే మీరింటికి వెళ్ళగానే జాగ్రత్తగా పెట్టి పంపుతారా? (ఇంతలోకి భోజనానికి రమ్మని పిలుపు) ఇంకా యేమిటండి విశేషాలు. మీ ప్రాంతంలో రాతిమీదా, రాగి రేకులమీదా చెక్కిన శాసనాలేమయినా దొరుకుతాయా?' అంటూంటే ఆయనగారు ఏవో వాటికి సమాధానాలు చెబుతున్నారు.

'ఏమండీ! వడ్డన అయిందా?' 'చల్లారి పోతోంది కూడాను' సరే లేవండి లేవండి బాబూ!' భోజనానంతరం కాసేపు విశ్రాంతి.

మేము ఊళ్ళో షికార్లుకొట్టి సాయంకాలం 4గం॥కు వచ్చాము. శాస్త్రి గారు కిట్లో బెంచీ మీద కూర్చున్నారు. మమ్మల్ని చూడగానే... 'మీ మచ్చమాయ, ఎక్కడికి వెళ్ళారు? మీ కోసం ఎంతసేపట్నుండి కాచు క్కూర్చున్నాను. ఆ ప్రబుద్ధుడు ఏడీ సీసా? మీరెవరూ లేకపోవడం మూలాన నేనే ప్రూఫు దిద్ది ప్రెస్సుకు పంపించాను. ఇంకా చాలా పనులున్నాయయ్యా! దేనికని ఆ ఘోరించేది? మీరు కొంచెం పళ్ళు పంచి ఆ వుత్తరాలు, పుస్తకాల పనులు చూడండి!' అన్నారు. కోదండరామయ్య ఉత్తరాలు వ్రాస్తున్నాడు. అప్పటికి

5గం॥ అయింది. ఉత్తరాలూ అవీ తర్వాత రాయవచ్చు ఇలా కూర్చోండి.

ఈ లైను గురించి భక్తి విశ్వాసాలు, నమ్మకం నెలకొని ఉందిట్రా? - ఏమో
నిజం చెప్పండి. వీళ్ళంతా ఏవేవో బాధలతో మనయింటికి రావడం ఏమిటి
వారి బాధలు నిమిషాలలో తగ్గటమేమిటి? ఇదంతా మాష్టరుగారి అనుగ్రహం
ఏమయినా నాలో ఉచ్ఛ్వాస,నిశ్వాసాలుంటే అది అంతా మాస్టరుదే. ఏమంటారు?'

ఏరా? సచ్చిదానందం! నిన్న ట్రీటుమెంటుకు వచ్చాడే మీ స్నేహితుడు
ఆయన ఏలాగున్నాడు?'' ''వాడికేమండి. అంతా తగ్గి పెళ్ళికొడుకులా
ఉన్నాడు. కొండపైకి నడిచే వెడతానంటున్నాడండీ!''

'శుభం! ఏదో మన ప్రభ ఇలా వెలుగుతూంది! మనమంటే ఏమిటిరా?
నీవూ, నేనూనా? సచ్చిదానందం.' కాదండి సార్. అదంతా మాస్టరుగారి ప్రభ

'ఆ... యముడివిరా నీవు. ఫరవాలేదు. ఏదో దారిలోకి వస్తున్నావు
మీరంతా ఇది మాత్రం బాగా గుర్తుంచుకోండి. ఈ నిర్వాకమంతా మనది
కాదు. మాస్టరుది. శరీరంలో ఏదో యాక్షన్ జరుగుతూంది యీ మాటలు
అంటూంటే' చూడండి ఏం జరుగుతుందో! అంటూండగానే సాయంకాలం
ప్రేయరుకు వచ్చే మిత్రులలో కొంతమంది వచ్చారు. 'లోపలకు పోదాం
పదండి' అంటూ ప్రేయరు హాలులో కూర్చున్నాము 'ఏమండీ! ఇవాళ పేపరు
విశేషాలేమిటి?' అంటూ కొంత సేపు వార్తల గూర్చి చర్చ జరిగింది.

అంతలో 6 గంటలయింది.

'ప్రేయరుకు రావలసిన వారందరూ వచ్చారా? లేదా' అని విచారించి
అందరూ సర్దుకొని సుఖంగా కూర్చోండి. ఓరేయ్! ఆ వెలుతురు కష్టంగా
వుంది. కాస్త ఓరవాకిలిగా తలుపు వేయరా. ఊ ఇంకొంచెం. అహఁ. మరీ
చీకటిగా వుందిరా! ఆఁ అది. రైట్- ఇపుడు సరి.

9

పెద్దవాడూ! ఓరేయ్. గోలచేయక ఇలావచ్చి నమస్కారము చేసుకో,' అని మనమణ్ని దగ్గరకు పిలిచారు. 'సచ్చిదానందం కాసిని వేడి మంచినీళ్లు తెచ్చిపెట్టరా' అదిగో అక్కడే పెట్టాం' అని అమ్మగారన్నారు. గ్లాసు తీసుకొని 'మరీ హాట్‌గా ఉన్నాయి. ఒక్కచుక్క... టయిము అయినట్టుంది, నమస్కారం చేసికొందాం'.

తరువాత వారి వారి అనుభూతుల గూర్చి శాస్త్రిగారడగడం–వారు చెప్పడం– దాని మీద శాస్త్రిగారు కొంత విపులంగా చెప్పడం జరిగింది. సుమారు 8 గం॥ అయింది. వచ్చిన వారంతా వెళ్ళారు. మేం మాత్రం ఉన్నాం. శాస్త్రిగారు లేచి 'బయట చల్లగా, హాయిగా ఉంది. అలా వెన్నెల్లో బయట కూర్చుందాం?' అన్నారు. అందరం బయటకు వెళ్ళినాము. బల్ల మీద శాస్త్రిగారు కూర్చున్నారు. మేమంతా క్రింద కూర్చున్నాము. కొంతసేపు కూర్చున్న తర్వాత 'కాస్తల్లా గుడి చుట్టూ తిరిగొద్దాం', 'సరే' నంటూ అందరం బయలుదేరాం. సీసా గారి ఇంటి ముందు రెండు నిమిషాలు నించున్నాం. 'ఏమమ్మా! దేవుడున్నాడా?' అన్నారు శాస్త్రిగారు. ఆవిడ, 'లేరు నాన్నగారు' అని చెప్పింది. 'రాగానే ప్రియుడి కోసం ప్రేయసి వచ్చి వెళ్ళిందని చెప్పమ్మా', అని చెప్పి బయలు దేరినారు. 'పాపం! వాడి మచ్చ మాస్తూందిరా. పగలు ఆఫీసు, సాయంకాలం గుడి, సరే మనం అలా తిరిగి వెడదామా?' 'అలాగే' అని– తిరిగి అందరం యింటికి వచ్చాం. యింటి వాకిట్లో 14 యేళ్ళ కుఱ్ఱవాడొకడు కూర్చొని ఏడుస్తున్నాడు. ప్రక్కనిద్దరు వాణ్ణి అనునయిస్తున్నారు. మేం దగ్గరకు వెళ్ళిన తర్వాత శాస్త్రిగారు 'ఏవరుబాబూ! మీకేం కావాలి?' అన్నారు. 'తేలు కుట్టింది స్వామీ! కుర్రవాడు ఏడుస్తున్నాడు.' అన్నాడొకాయన. 'ఏరా తేలు నిన్ను కుట్టిందా? నీవే దాన్ని కుట్టావురా! ఏది, లేచి నుంచో.' అన్నారు. లేవలేడండీ స్వామీ! కూలబడి పోతున్నాడు. అన్నాడు పక్కనాయన. 'నువ్వు వూరుకోవయ్యా... వాడే లేస్తాడు. ఏంరా–లే. ఏమిటట్లా మూలుగుతావ్. తేలూ లేదు. గీలూ లేదు.

## 8

5గం॥ అయింది. ఉత్తరాలూ అవీ తర్వాత రాయవచ్చు ఇలా కూర్చోండి

ఈ లైను గురించి భక్తి విశ్వాసాలు, నమ్మకం నెలకొని ఉందిరా? - ఏమో నిజం చెప్పండి. వీళ్ళంతా ఏవేవో బాధలతో మనయింటికి రావడం ఏమిటి వారి బాధలు నిమిషాలలో తగ్గటమేమిటి? ఇదంతా మాస్టరుగారి అనుగ్రహం ఏమయినా నాలో ఉచ్ఛ్వాస,నిశ్వాసాలుంటే అది అంతా మాస్టరుదే. ఏమంటారు?'

ఏరా? సచ్చిదానందం! నిన్న ట్రీటుమెంటుకు వచ్చాడే మీ స్నేహితుడు ఆయన ఏలాగున్నాడు?'' ''వాడికేమండి. అంతా తగ్గి పెళ్ళికొడుకులా ఉన్నాడు. కొండపైకి నడిచే వెడతానంటున్నాడండీ!''

'శుభం! ఏదో మన ప్రభ ఇలా వెలుగుతూంది! మనమంటే ఏమిటిరా' నీవూ, నేనూనా? సచ్చిదానందం.' కాదండి సార్. అదంతా మాస్టరుగారి ప్రభ

'ఆ... యముడివిరా నీవు. ఫరవాలేదు. ఏదో దారిలోకి వస్తున్నావు మీరంతా ఇది మాత్రం బాగా గుర్తుంచుకోండి. ఈ నిర్వాకమంతా మనది కాదు. మాస్టరుది. శరీరంలో ఏదో యాక్షన్ జరుగుతూంది యీ మాటలు అంటూంటే' చూడండి ఏం జరుగుతుందో! అంటూండగానే సాయంకాలం ప్రేయరుకు వచ్చే మిత్రులలో కొంతమంది వచ్చారు. 'లోపలకు పోదాం పదండి' అంటూ ప్రేయరు హాలులో కూర్చున్నాము 'ఏమండీ! ఇవాళ పేపరు విశేషాలేమిటి?' అంటూ కొంత సేపు వార్తల గూర్చి చర్చ జరిగింది.

అంతలో 6 గంటలయింది.

'ప్రేయరుకు రావలసిన వారంధరూ వచ్చారా? లేదా' అని విచారించి అందరూ సర్దుకొని సుఖంగా కూర్చోండి. ఓరేయ్! ఆ వెలుతురు కష్టంగా వుంది. కాస్త ఓరవాకిలిగా తలుపు వేయరా. ఊ ఇంకొంచెం. అహఁ. మరీ చీకటిగా వుందిరా! ఆఁ అది. రైట్- ఇపుడు సరి.

పెద్దవాడూ! ఓరేయ్. గోలచేయక ఇలావచ్చి నమస్కారము చేసుకో' అని మనుమణ్ణి దగ్గరకు పిలిచారు. 'సచ్చిదానందం కాసిని వేడి మంచినీళ్లు తెచ్చిపెట్టరా' అదిగో అక్కడే పెట్టాం' అని అమ్మగారన్నారు. గ్లాసు తీసుకొని 'వెరీ హాట్‌గా ఉన్నాయి. ఒక్కచుక్క... టయిము అయినట్టుంది, నమస్కారం చేసికొందాం'.

తరువాత వారి వారి అనుభూతుల గూర్చి శాస్త్రిగారడగడం–వారు చెప్పడం– దాని మీద శాస్త్రిగారు కొంత విపులంగా చెప్పడం జరిగింది. సుమారు 8 గం॥ అయింది. వచ్చిన వారంతా వెళ్ళారు. మేం మాత్రం ఉన్నాం. శాస్త్రిగారు లేచి 'బయట చల్లగా, హాయిగా ఉంది. అలా వెన్నెల్లో బయట కూర్చుందాం?' అన్నారు. అందరం బయటకు వెళ్ళినాము. బల్ల మీద శాస్త్రిగారు కూర్చున్నారు. మేమంతా క్రింద కూర్చున్నాము. కొంతసేపు కూర్చున్న తర్వాత 'కాస్తల్లా గుడి చుట్టూ తిరిగొద్దాం', 'సరే' నంటూ అందరం బయలుదేరాం. సీసా గారి ఇంటి ముందు రెండు నిమిషాలు నించున్నాం. 'ఏమమ్మా! దేవుడున్నాడా?' అన్నారు శాస్త్రిగారు. ఆవిడ, 'లేరు నాన్నగారు' అని చెప్పింది. 'రాగానే ప్రియుడి కోసం ప్రేయసి వచ్చి వెళ్ళిందని చెప్పమ్మా', అని చెప్పి బయలు దేరినారు. 'పాపం! వాడి పుచ్చ మాస్తూందిరా. పగలు ఆఫీసు, సాయంకాలం గుడి, సరే మనం అలా తిరిగి వెడదామా?' 'అలాగే' అని– తిరిగి అందరం యింటికి వచ్చాం. యింటి వాకిట్లో 14 యేళ్ళ కుఱ్ఱవాడొకడు కూర్చొని ఏడుస్తున్నాడు. ప్రక్కనిద్దరు వాణ్ణి అనునయిస్తున్నారు. మేం దగ్గరకు వెళ్ళిన తర్వాత శాస్త్రిగారు 'ఏవరుబాబూ! మీకేం కావాలి?' అన్నారు. 'తేలు కుట్టింది స్వామీ! కుఱ్ఱవాడు ఏడుస్తున్నాడు.' అన్నాడొకాయన. 'ఏరా తేలు నిన్ను కుట్టిందా? నీవే దాన్ని కుట్టావురా! ఏది, లేచి నుంచో.' అన్నారు. లేవలేడండీ స్వామీ! కూలబడి పోతున్నాడు. అన్నాడు పక్కనాయన. 'నువ్వు వూరుకోవయ్యా... వాడే లేస్తాడు. ఏంరా–లే. ఏమిటట్లా మూలుగుతావ్. తేలూ లేదు. గీలూ లేదు.

కూడా ఇవ్వనా?' నవ్వుతూ 'మీఇష్టం' అన్నాడు. ఇంతలోకి అమ్మగారు 'భోంచేసి, కాసిన్ని పాలు త్రాగుతారా!' అన్నారు. 'మీదయ'. అందరం వారి మంచం ఆనుకుని కూర్చున్నాము. ఏదో ప్రసంగంలో తంజావూరు కవులు–కవిత్వం అన్న ప్రసంగంలో వారు చేమకూర వారిని గూర్చి చెబుతూ వారి పద్యాల్లో ఉండే ప్రతి పద్య చమత్కృతిని వర్ణిస్తూ–

పోకమ్రాకుల మహిమ, కప్పురపుటనంటి
యాఁకుదోటల సౌభాగ్య, మందె గలదు
ప్రబల మౌక్తిక సౌధ సంపదల మహిమ
వీటి రహి మెచ్చవలయుబో వేయునోళ్ళ.

''ఎంతైందయ్యా టయిము?''

''11 గంటలు కావస్తోందండీ.''

''అబ్బ! దీపం కష్టంగా ఉందయ్యా! 'ఆర్పేయనాండి!' – 'ఎవడురా అది? మాటలలో సభ్యత నేర్చుకోవద్దూ! దీపం ఆర్పనా అంటారా! ఉంచనా అని అడగాలి గాని, తీసి పడుకోండి.

దివ్యద్దివ్య భవత్కృపా గరిమచే దేదీప్యమానంబుగా
నవ్యంబై నటువంటి దివ్యపథమున్ నానాట యోగీశ సం
సేవ్యం బైనది తారకంబనంబడున్ సద్యోగమార్గంబు మ
మ్మే వ్యాధుల్ జెనకంగనీక నిలుపున్ ఏకార్థ సంధాయియై.
పాండిత్యాభినివేశముం గవన తాత్పర్యంబు విత్తార్జనో
ద్దండారంభమునుం గ్రముక్రమముగా సన్నంబులౌచుండె నో
తండ్రీ విశ్వవిభూ! సుఖంపడెద నీ తంటాలు నాకేల నీ
యండ న్నిల్చెద ప్రేల్చెదన్ బృహదవిద్యాదోష పాషాణముల్.

పోయిందే నొప్పి అన్నారు. వాడింకా సరిగా నుంచోలేదు. అదేవిటి ఆ వేషం...సరిగా నించుంటావా... లేకపోతే కర్రతో ఓటి అంటించమంటావా? అంటూ వానిని దేవునికి నమస్కారం చేసుకో. తగ్గుతుంది.' అని రెండు నిమిషాలు ట్రీట్‌చేసి దగ్గరకు పెళ్ళారు. వాడు సరిగా నుంచున్నాడు. భుజంపై తడుతూ 'నీ పేరేమిటిరా? ఎన్నేళ్ళు...' అన్నారు. ఏదో సమాధానం చెప్పాడు. 'అయితే పెళ్ళయిందా?' కాలేదని తలతిప్పాడు. అయితే పిల్లలెంతమందిరా? అన్నారు ఛలోక్తిగా, మేమందరం గొల్లున నవ్వాం. మాతో వాడూ నవ్వాడు. 'అదుగో వాడూ నవ్వుతున్నాడే. అంతా దొంగవేషమే. తేలూ కుట్టలేదు...ఏమీలేదు. యింటికి పో' అన్నారు. వాడు 'కుట్టింది స్వామీ! చాలా బాధ పడ్డాను. ఇప్పుడు బాధ ఏమీలేదు' అన్నాడు. అవును పాపం శరీరమంతా చమట పోసింది. ఇంటికి వెళ్ళి స్నానం చెయ్యి' అన్నారు. ఆపక్కాయన 'స్వామీ! మా వాడికి కొంచెం కొంచెం అన్నం పెట్టమంటారా?' అన్నాడు. 'అబ్బే వల్లకాదు. కాస్త అన్నం పెడితే వాడికేం చాలుతుంది? బాగా దిట్టంగా పెట్టండి' అన్నారు. అందరూ నవ్వారు. 'సెలవిప్పించండి బాబయ్యా!' అన్నారు. 'మంచిది, ఒరేయ్ నీ పెళ్ళికి నన్ను పిలుస్తావట్రా' అంటూ వాళ్ళను పంపి మేము లోపలకు వెళ్ళాం. వారు బెంచీ మీద కూర్చున్నారు. లోపల నుండి అమ్మగారు వచ్చారు. చాలా నీరసంగా ఉందే. అన్నం పెడతావా?– 'వెళ్ళి వస్తానండీ' అన్నాడు సచ్చిదానందం. 'రాత్రి తాపీగా నిద్రపో' అన్నారు. అన్నం పెట్టాను రండి' అన్నారు అమ్మగారు, భోజనం అయింది. 'ఏరా సుందరమూర్తీ! ఆ మంచం కాస్త ఇలా వేయరా! విశ్రాంతి తీసుకొంటాను' అన్నారు.

ఇంతలో సీ.సా. అరటిపళ్ళు, పువ్వులు అవి తీసుకొచ్చాడు దేవాలయం ప్రసన్నుతో. శ్రీవారికిచ్చి మంచం ప్రక్క ఒరిగాడు. 'ఏమేవ్– చూచావా ఇలారా–సీ.సా. మంచి పళ్ళు, పూలు పట్టుకొచ్చాడు. ఏరా సీ.సా. ఆవిడకు

# 2. యోగ మార్గమున తొలిదశ

సర్వకర్తయా నీశ్వరేశ్వరుని దివ్య
తేజము వరేణ్యమును, వినుతింతు మెపుడు
ఇదిగదా లోననుండి మాకెపుడు మంచి
మంచి యుద్బోధముల నొదవించుచుండు.

గురుపాదులు శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి వద్ద శిష్యుణ్ణిగా చేరుటతో మంచి రసపట్టయిన సాహిత్య జీవితం ప్రారంభమయింది. పూర్వ కవుల పోకడలను అవగాహన చేసికొనుటలోను, శ్రీ వేంకటశాస్త్రిగారి రచనా పద్ధతులను వంట పట్టించుకొనుటలోను, ఆరంభమయిన సాహిత్యపు వ్యాసంగము క్రమక్రమంగా వృద్ధి పొంది, కావ్య రచనకు, అవధాన నిర్వహణకు దారితీసింది. తర్వాత మదరాసు వచ్చి ప్రాచ్య లిఖిత పుస్తక శాలలో పండితునిగా పని చేయుచు ప్రాచీన తాళపత్ర సంస్కృతాంధ్ర గ్రంథముల సేకరించుటలోను, వాటిని పరిష్కరించి ముద్రించుటలోను, శాసనముల పరిశోధించుటలోను, నిమగ్నుడనై నిరంతరం సాహిత్యగోష్ఠి, సాహిత్య విమర్శలలో మునిగి తేలుచుంటిని. చిన్నతనము నుండి యీ సాహిత్యసేవకు హత్తుకొని పోయిన నన్ను ''అది కాదు, నీకు పరమార్థము వేరే యున్నది. ఇది సాహిత్య సరస్వతి కాదు. పరబ్రహ్మము'' అని దిద్దినదీ ''భృక్త రహిత తారక రాజయోగము''.

ఈ యోగములో చేరుటకు ముందు నేను అనారోగ్యముతో బాధపడు చుంటిని. అట్టిస్థితిలో 1916 జూలై 22వ తేదీన నేను కుంభకోణం వెళ్ళి యీ యోగంలో చేరితిని. అప్పటినుండి శరీరారోగ్యం చక్కబడింది.

దుర్వ్యాధిఖిన్నే శరణం ప్రపన్నే
మయి ప్రసాదాదయి మాస్మభైషీః

త్రాతా హ మస్మీతి దదా పభీతిం
యస్తం గురుం మస్తకతో నమామి.

నారలు కట్టు చీర, లశనంబులు కాయ గసుళ్ళు, కొండలున్
కారడవుల్ నివాసములుగా దపియించి మహర్షు లెవ్వరిన్
జేరుకొనం దలంచి రల చిన్మయతత్త్వము సర్వమానవో
ద్ధారము గోరికొన్న యవతారము సద్గురుమూర్తి గొల్చెదన్.

అంటూ ఉన్న నా మనస్సుకూ, శారీరకమైన మార్పు కన్నా, తర్వాత వచ్చిన మానసికమైన మార్పు చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది. సాహిత్య వ్యాసంగం నుండి సంపూర్తిగ మనస్సు విడివడి బ్రహ్మజిజ్ఞాసకు అభిముఖమయింది.

పాండిత్యాభినివేశముం గవన తాత్పర్యంబు విత్తార్జనో
చ్చండారంభమునుం గ్రమక్రమముగా సన్నంబులౌచుండె నో
తండ్రీ! విశ్వవిభూ! సుఖంపడెద నీతంటాలు నాకేల నీ
యండ న్నిల్చెద ప్రీల్చెదన్ బృహదవిద్యాదోష పాషాణముల్.

కవితా శిల్పము సల్పగాఁ దొలుత పేడ్కల్ రేగె నాకుం, గృతుల్
చివురొత్తెన్ వెసమోము మొత్తె నిఁక నాచేఁ జెల్లవీ కల్లబొ
ల్లి వినోదంబు లిపే జరామరణముల్ చీడల్ హతం బార్చి పు
ట్టువు చెట్టున్ సఫలీకరించుకొని యంటుల్ గట్టెదన్ మాలినై.

పెండిలినాడె నన్ను వెఱపించెను బంచత, లోకరీతిచే
గొండొక యౌవ్వనంబుఁ జవిగో నవిగో ననఁగా జరామృతుల్
గండుపులుల్ గనంబడె పొకాలితి వ్రాలితి వజ్రపంజరం
బుండెడు కోణమందు సుఖముంటి నిఁకన్ బులిజంట గెంటెదన్.

తర్వాత శాకుంతలములోని 'అనాఘ్రాతం పుష్పం' అను శ్లోకమునకు

అదివరలో ఎప్పుడు చదివినా శృంగార పరముగానే యర్థమూహించె వాడను. ఇటీవల గురుతుకొచ్చినప్పుడు దాని యర్థము చాల సొగసుగ మారిపోయింది. దాని యర్థమిది.

సృష్టిలో మానవుని పంచేంద్రియములకు ఆ బ్రహ్మపదార్థ మింతవరక అందలేదు, ఘ్రాణేంద్రియము, బ్రహ్మపదార్థ మనే పుష్పమున ఆఘ్రాణించలేదు. త్వగింద్రియముచే, నీబ్రహ్మపదార్థమనే చిగుర తాకబడలేదు. చవికి అందనిదిగానే ఈ బ్రహ్మపదార్థమున్నది. ఎంత ప్రయత్నము చేసి కూడా మానవుని మేధస్సు, ప్రజ్ఞ సూక్ష్మముగా వాడిగా ఈ మాయావరణమును చీల్చుకొని లోనికి ప్రవేశించినను, అసల సత్యమును గుర్తించలేదు. ఇంతవరకు దుర్లభముగా నున్న ఆ బ్రహ్మ పదార్థమును పొందుట కెవరికి లభ్యమౌతుందో!

చెట్టుకు విత్తనము వలె, శరీరమునకు కుండలిని యున్నది. వెన్నెముక నొక చెట్టుగా గైకొన్నచో పైశరీరమంతయు వృక్షశాఖలును, క్రింది శరీరమంతయూ వృక్షము వ్రేళ్ళును, వృక్షమునకు మూలాధారమగు విత్తువలె శరీరమునకు కుండలినియు నున్నది.

# 3. అనుభూతి

గవర్నమెంటు పనుపున ప్రాచ్యలిఖిత తాళపత్ర గ్రంథసేకరణ నిమిత్తం నేను విశాఖపట్టణ ప్రాంతానికి వెళ్ళాను. అక్కడి నుండి ఒక పల్లెటూరికి బయలుదేరి వెళ్ళాను. రెండుమూడు రోజులలో అక్కడ పని చూచుకొని వేటొయొక చోటకి వెళ్ళాలని తలచాను. కాని ఒకరోజున రెండు సీతాఫలములు తిని, ఇన్ని మంచినీళ్ళు త్రాగాను. తర్వాత నుండి ఆకలి వేయడం లేదు. విరోచనం అవడంలేదు. అక్కడనాకు సర్వవిధాల సదుపాయాలు సమకూరుస్తున్న స్నేహితునికి జరిగిన సంగతి చెప్పి, 'శ్రీ మాస్టరు గారిని ట్రీటుమెంటు చేయమని కోరుతూ జరిగిన సంగతులను వివరించి వారికి కుంభకోణం జాబు వ్రాసాను. అది మూడు రోజులలో అందవచ్చు. దాన్ని చూచిన తర్వాత వారు ట్రీటుమెంటు చేస్తే- నాకిక్కడ శరీరంలో అంతా సర్దుకొని యథాప్రకారంగా ఆకలి వేస్తుంది' అని వారితో చెప్పాను. కాని ఆ స్నేహితునికి మాత్రం ఇదంతా వేళాకోళంగా కనిపించంది. 'ఏమండీ! మీరు అక్కడికి ఉత్తరం వ్రాయటం ఏమిటి? అది చూచి అక్కడివారు ట్రీటుమెంటుచేస్తే ఇక్కడ మీకు తగ్గడమేమిటి? ఇదంతా మీ పిచ్చికానీ, లేకపోతే కాస్త విరోచనాలకు మందు తీసుకొంటే, దాంతో శరీరంలోని కుట్ర అంతాపోయి సుఖంగా ఉంటారు కదా?' అన్నాడు.

కానీ నా మనస్సుకు మాత్రం చాలా ధైర్యంగా ఉండింది. శ్రీ మాస్టరు గారు ట్రీటుమెంటు చేస్తే తప్పక నాకిక్కడ ఆరోగ్యం కలుగుతుంది అని. అప్పటికప్పుడే మూడు రోజులయింది. నాలుగో రోజది శ్రీవారికి జాబు వ్రాసి. ఈ నాలుగురోజుల నుండి నాకు ఆకలిలేదు, విరోచనము లేదు. పైగా వీటివల్ల యేమి బాధాకరంగా కూడాలేదు. చాలా సుఖంగానే ఉన్నాను.

నా విషయం పరికిస్తూన్న స్నేహితుడు నవ్వుతూ- 'ఏమండీ శాస్త్రిగారూ!

చూచారా! ఆనాడే నేను చెప్పినట్లుగా చేస్తే యింత వరకూ వచ్చేదా? ఇప్పుడైనా నామాట విని కాస్త విరోచనాలకు మందు తీసుకోండి. పోనీ మీరు చెప్పినట్లుగా ఇప్పటికి నాలుగు రోజులయిందే. ఈపాటికయినా చేరదా? చేరితే మీరు చెప్పినట్లుగా జరిగుండేది కదా? ఏమో బాబూ నాకు మాత్రం ఈ విషయంలో నమ్మకం లేదు. అసలు అందకపోతే మీ పని యింతేనా? నామాటవిని...

'అతను చెప్పే మాటలకు నాలో నేనే నవ్వుకుంటూ, 'నాలో మాష్టరుతత్వం పనిచేస్తూంది. అందువల్ల తప్పక రిలీఫ్ కలుగుతుంది' అనే నమ్మకం మనస్సులో గట్టిగా నాటుకుంది. అని తలపోస్తూ, పైకి వారితో 'బాబూ! నా ఉత్తరం వారికి ఆలస్యంగా చేరవచ్చు. అదీకాక నాకేమీ శరీరంలో బాధ లేదు. కాకపోతే ఆకలి వేయడం లేదు. విరేచనం కావడంలేదు. దీని కోసమా అంత బెంగ పడాలి. మనం దేనినయినా నమ్ముకుంటే దానిలోని సత్యాన్ని గుర్తించే వరకు గండుచీమ పట్టుకున్నట్లుగా దానినే ఆరాధించాలి, సాధన చేయాలి. ఇంతకూ దేనికి కంగారు? ఇందలి సత్యాన్ని మీరే త్వరలో గుర్తిస్తారు' అన్నాను. కాని వారికి మాత్రం అంతా అపహాస్యంగానే ఉంది. యథాప్రకారం నేను నమస్కారం ఉదయ సాయంతనములు చేసుకొంటున్నాను. మర్నాడు మధ్యాహ్నం 2గంటలకు నాలో అలజడి బయలుదేరింది. గ్లాసెడు మంచినీళ్ళు త్రాగాను. తరువాత కొంతసేపటికి విరేచనమయింది. తరువాత బ్రహ్మాండంగా ఆకలి వేసింది. తిండితిని ఈ నాల్గయిదు రోజులు చేయని పని ముగించుకొని ఆరవరోజు వెళ్ళాలని తలచాను. జరిగిన సంగతి స్నేహితుడు పరికిస్తున్నాడు.

నేను బయలుదేరు నాడు మధ్యాహ్నము రెండు గంటలకు ఆ స్నేహితుడు ఒక జాబు తీసుకొచ్చి యిచ్చినాడు. అది మాస్టరుగారు వ్రాసింది. చాలా సంతోషపడితిని. అందులో ఈ విధంగా ఉంది.

'నీవు వ్రాసిన జాబు మొదట కుంభకోణము చేరినది. అక్కడ నేనులేను.

రెండురోజులయింది మదరాసు వచ్చి. కనుక కుంభకోణములో ఆ జాబును చూచి తక్షణం తిర్గు టపాలో పంపిరి. ఇవాళ రెండుగంటలకు చేరినది. చూచిన తక్షణం ట్రీటుమెంటు చేసితిని. శరీరంలో అలజడి అంతా సర్దుకొని సుఖంగా ఉంటుంది. నీవు యథాక్రమంగా నీ పనిని చేయు చుండుము.'

ఆ వుత్తరము వారికి చూపితిని. వారు చదివి ముక్కుమీద వేలు వేసుకొని 'నిన్న రెండు గంటలకు మద్రాసులో ట్రీటుమెంటు చేయడం అదే రెండు గంటలకు సరిగా మీకిక్కడ రిలీఫ్ కలగడము, చాల వింతగా ఉందండీ. అందులోనూ ఉత్తరం ద్వారా జరగడం వింతలో వింత' అంటూ నివ్వెరపోయాడు.

క్షణక్షణము సత్యజ్ఞాన సంతోష సంపత్సంగతిన్ బొంగుచుండన్
చణమయి విలసిల్లెన్ స్వాంతమున్ దిద్దుకొమ్మా
ప్రణుతిపరతః దప్పం బాయగా నేరనన్నా
అణువణువున నాలో నైక్యముం జెందు తండ్రీ!



''నా 25వ యేట భయంకర వ్యాధిగ్రస్తుడనైనాను. ఏ మందులకు, మాకులకు వ్యాధి కుదరలేదు. తుదకు అప్పటి ప్రసిడెన్సీ కాలేజి ప్రొఫెసరు శ్రీ పోతరాజు నరసింహం గారి ద్వారా కుంభకోణంలో వున్న శ్రీ సి.వి.వెంకాసామిరావు గారనే మహాముని ట్రీటుమెంట్ ద్వారా ఆరోగ్యాన్ని పొందాను. అప్పటి నుంచి ఆ మార్గమే ఉత్తమమైనదని విశ్వాసం కలిగింది. శరీరమనే పుస్తకాన్ని చదివే తీరును నేను వారి నుండే ఉపదేశం పొందాను. అంతర్ముఖులమై ఈ శరీర పుస్తకాన్ని అధ్యయనం చేస్తే మన ప్రజ్ఞ ఒకచోటను చూడుకొంటుంది. అదే కుండలిని. జడ కోలాటపు దారాలన్నీ కేంద్రం నుంచి పాయలు పాయలుగా దేహంలో క్రిందికి దిగి వెళ్ళుతున్న శాఖోపశాఖలైన దారాలకు కేంద్రం కుండలిని. అదే ఈశ్వరుడు; ఈశ్వరుడు మూత్ర, పురీషకోశాల మధ్య మూలాధారంలో సృష్టికర్త రూపంగా వున్నాడంటే ఆశ్చర్యం కల్గుతుంది కదూ!''

# 4. ప్రేమ

ఒకనాడు నాకు గుండెలో నొప్పిగా ఉంది. దీనికి కారణం ఏమని ఆలోచిస్తే కొంతసేపటికి జరిగిన సంగతి గుర్తుకు వచ్చింది. అది ఇది. శ్రీ సెట్టిగారికి శరీరంలో అనారోగ్యం, విపరీతమైన గుండెనొప్పి. వీటితో ఆయన బాధపడేవాడు. వాటికి ట్రీట్‌మెంటు చేయగా అంతా చల్లగా సర్దుకుంది. కానీ వారికా బాధ తగ్గిపోగా నా గుండెలో నొప్పియేమిటి? దీనికి కారణం ప్రేమ. వారు చాలా బాధ పడుతున్నారు. వారి బాధ తగ్గిపోయి సుఖంగా ఉండాలని మాష్టరుని కోరుకొనే వాడిని. అంటే వారూ, నేను ఒకటే అనే భావంతో. వారు సుఖంగా ఉంటే నా సుఖమూను. ఇటువంటి తీయని భావంతో ఎవరయినా భగవంతుని ఆరాధిస్తే వారి తలపులు సత్యం అవుతవి. అదే స్వచ్ఛమయిన ప్రేమ.

ఇటువంటి ప్రేమను గుర్తించటం మొదట నెల్లూరులో ప్రారంభమయింది.

ఏదో పని మీద నేను ఒకసారి నెల్లూరుకు వెళ్ళాను. అక్కడ ఆ రాత్రికి స్నేహితుని ఇంటిలో బసచేశాను. రాత్రి 8గంటలయింది. అంతలో ప్రక్కయింటిలో ఎవరో బాధతో మూల్గుచున్నట్లు వినిపించింది. అదేమిటని విచారించగా 'ఆ ప్రక్కనున్న గృహస్థు వారం నుండి జ్వరంతో బాధపడుతున్నట్లు, సాయంకాలం చాల ప్రమాదావస్థలో నున్నట్లు తెలిసింది. నాకు అయ్యో పాపం! అతను ఎంత బాధపడుతున్నాడో! బాధంతా తగ్గిపోయి సుఖంగా ఉంటే బాగుండును. అని తోచింది. తర్వాత ఆ విషయాన్నే మరచాను. కొంత సేపయ్యాక నిద్రిద్దామని మంచం మీద పండుకొన్నాను. కాని నిద్ర రాదు. ఒకటే దాహము. శరీరములో ఏదో తపన బయలుదేరింది. నిద్రపట్టవన్నా పట్టలేదు. తాగేందుకు నేను

పండుకొన్నచోట నీళ్ళులేవు. అప్పటికి రాత్రి రెండుగంటలు కావచ్చింది. నాకు మాత్రం దాహం తీరే ఉపాయం తోచలేదు. ఆబాధ భరించలేక పక్కవారింటికి వెళ్ళి, దాహం తీర్చుకొద్దామని– తలచి, వారి యింటికి వెళ్ళాను. అక్కడ రోగి జ్వరంతో బాధపడుతున్నాడు. ఇంటిలో ఆయన భార్య తక్క ఇంకెవ్వరూ లేరు. నన్ను చూచి ‘‘ఏం కావాలి బాబూ అన్నది ఆ ఇల్లాలు. కాని అక్కడ మంచినీళ్ళు త్రాగడానికి మనస్కరించక ఆ జబ్బుపడినవాని స్థితిగతుల నడిగాను.

ఆమె ఇలా చెప్పింది.

‘ఈయన నా భర్త. వారం దినాలుగా జ్వరంతో బాధపడుతున్నారు. ఎన్ని మందులిచ్చినా నయం కావడంలేదు. అదీగాకమేమిద్దరం తప్ప మాయింట్లో ఎవరూ లేరు. బంధువులు చాలా దూరాన ఉన్నారు. మందు తెచ్చుటకు నేనే వెళ్ళుచున్నాను. ప్రస్తుతం వీరి పరిస్థితి మరీ విషమించింది. ఇట్టి స్థితిలో వీరిని వదిలి ఎక్కడికీ పోవడానికి వీల్లేదు. నా పుట్టింటి వారికి కబురు చేస్తే వారింకా రాలేదు. నాకు యేమీ దిక్కు తోచడం లేదు బాబూ!’ అంటూ వచ్చే కన్నీటిని పమిటచెంగుతో తుడుచుకుంటూ చెప్పింది.

నాకు చాలా జాలి వేసింది. రోగి దగ్గరకు వెళ్ళి శరీరం తాకి చూచాను. జ్వరం చాలా తీవ్రంగా ఉంది. సంధి లక్షణాలు కూడా కనబడుతున్నాయి.

అంతలో ఆమె ‘బాబూ! ఇవాళ మధ్యాహ్నాము నుంచి ఏవేవో పిచ్చిపిచ్చిగా మాట్లాడుతున్నారు. సంధించిందేమో! నాగతి యేంకానో? అని కంటనీరు పెట్టుకుంది.

నేను చాలా ఫీలయినాను. నోట మాట రాలేదు. తిరిగి బయటకు వచ్చాను. నేనాయింటిలో ప్రవేశించినపుడు శరీరంలో ఉన్న తపన, దాహం అన్నీ మరచాను. ఒకటే చింత ‘అయ్యో! ఆయన బాధ ఎట్లు పోవునా అని. ఆ చింతతో ఇంటికి వెళ్ళి పండుకొన్నాను. క్రమక్రమంగా కొంత సేపటికి శరీరంలో బాధ, మనస్సులో ఆందోళన తగ్గింది. దానితో నిద్రపోయాను.

ఉదయం నిద్ర లేవగానే తోచిన తొలుతటి భావం ఇది. 'నిన్నరాత్రి జ్వరంతో బాధపడుతున్న పక్కయింటి యజమాని ఎట్లా వున్నాడో' అని. వెంటనే ఆయన స్థితి తెలుసుకోవడానికి వారి యింటికి వెళ్ళాను.

ఇంటి యజమానురాలు ముంగిట పనిచేయుచు నన్ను చూచి అపరిమితానందంతో 'బాబుగారూ! లోనికి దయచేయండి. రాత్రి తమరు మాయింటికి వచ్చి వెళ్ళినప్పటినుండి మావారి స్థితి చక్కబడ ప్రారంభించింది. మీరు వెళ్ళిన తర్వాత గంటకు వారు నాతో ఇలా అన్నారు' ''ఏమే! ఇందాక మన యింటికి వచ్చిన వైద్యుడు మంచి మందు యిచ్చాడే! ఆ మందు తీసికొన్నప్పటి నుండీ నాకు చాల సుఖంగా ఉంది. ఆరోగ్యం కలుగుతుంది అని తోచింది'' అని. సంధించినప్పుడు వచ్చే ప్రలాపాలేమో అనుకొని వారితో-వైద్యుడూ లేదు-మందూలేదు. అది అంతా మీ పైత్య భ్రమ కాని, మాట్లాడక పడుకోండి.''-అన్నాను. కాని, ఆయన ఒప్పుకోక ''అలాకాదు చూడు, ఆ వైద్యుడు ఇక్కడ కూర్చొని, నన్ను ఇలా తాకి చూచాడు. నాకు మందు ఇచ్చాడు. ఆయన ఈరకం పంచె కట్టుకొని వున్నాడు, కండువా వేసుకొన్నాడు. ఈ విధంగా ఉంటాడు. అంటూ అచ్చం మిమ్ములనే వర్ణించారు. చాలా వింతగా ఉంది బాబుగారూ! లోనికి దయచేయండి. వారు చాలా కులాసాగా ఉన్నారు'' అంటూ లోనికి తీసుకొని వెళ్ళింది.

నేను లోనికి వెళ్ళగానే రాత్రి మహాప్రమాదంలో నున్న రోగి ఇప్పుడు మంచం మీద కూర్చున్నాడు. నన్ను చూడగానే నమస్కరించి 'అయ్యా! దయచేయండి. రాత్రి మీరువచ్చి రక్షించారు. మీరిచ్చిన మందు అద్భుతంగా పనిచేసింది. నాకసలిప్పుడు ఏమీ జబ్బు లేదేమో అన్నంతగా ఉంది' అన్నాడు. నేనామాటలు విని తెల్లబోయాను. ''నేనేమీ మందియ్య లేదే! ఈయన యిలా అంటాడే. ఇంకా యేమయినా పైత్యభ్రమలో నున్నాడా?'' అని తలపోశాను. వెంటనే నాలో మెరపు మెరసినట్లయింది, శరీరమంతా

క్షుల్లమున్నది. లోపల ఎవరో ప్రభోధించినట్లు తోచింది.

''ఏమీ మందియ్యలేదా? ఎంతో ప్రేమతో, దయతో, ఆర్ద్రతతో అయ్యోపాపం ఆయన బాధ తగ్గాలని నీవు ఆరాటపడితివే, అంతకన్నా మందేమిటి? ఆ సానుభూతిని మించిన ఔషధం ఇంకేదీ! నీలో వెల్లివిరిసే ప్రేమ అన్నింటినీ చక్కదిద్దగల దివ్యౌషధం'' అని.

అప్పటినుండి– స్వ,పర బేధాలు లేకుండా ఉపకారం చేయాలనే సత్సంకల్పం నాలో హత్తుకు పోయింది.

ధనసంపాదన తత్పరత్వమున వంతన్ సెంద నుద్యోగపుం
బెనుపుల్ వొందగ వందుఅన్, సుకవితావిద్యావిశేషమ్ములన్
ఘనతంగోరి తపింప నీపయి జగత్కల్యాణమై పొల్చు నీ
యనవద్యస్థిర సత్కృపా గరిమయే యర్థింతు నాత్మేశ్వరా!

కమ్యూనిస్టులు దైవము లేడందురు. ఆ పార్టీకి చెందిన ఘనుడొకడు తన సిద్ధాంతమును లోకమున కెరిగించుటకై తన వాకిట నింగ్లీషులో "God is no Where" అని యొక బల్లమీద వ్రాసి కట్టినాడట. దానిని ఆంగ్లము బాగా చదువుకొన్న విద్యార్థి యొకడు నీ వ్రాతను బట్టి దైవమున్నాడని తెలుస్తోంది చూశావా? అంటూ అతనితో అని, "God is now Here" అని చదివాడట. అంతటితోనయినా ఊరుకోక సంస్కృతములో ''ఈశ్వరోనాస్తి'' అని వ్రాశాడట. సంస్కృతము చక్కగా చదువుకొన్న విద్యార్థి యొకడు దానిని చూచి 'ఈశ్వరో నా అస్తి' అని చదివాడట. 'నా' అంటే మనుష్యునిలోనే ఉన్నాడని అన్నాడు. ఈ బల్ల యెటుచూచినా చిక్కుగా నున్నదని ఆ తర్వాత ఆతడూరకున్నాడు.

ప్రకృతియంతా దైవమయమే. లేడన్నచోటనే సత్యపురుషుడగు దైవమున్నాడు.

ఉదయం నిద్ర లేవగానే తోచిన తొలుతటి భావం ఇది. 'నిన్నరాత్రి జ్వరంతో బాధపడుతున్న పక్కయింటి యజమాని ఎట్లా వున్నాడో' అని. వెంటనే ఆయన స్థితి తెలుసుకోవడానికి వారి యింటికి వెళ్ళాను.

ఇంటి యజమానురాలు ముంగిట పనిచేయుచు నన్ను చూచి అపరిమితానందంతో 'బాబుగారూ! లోనికి దయచేయండి. రాత్రి తమరు మాయింటికి వచ్చి వెళ్ళినప్పటినుండి మావారి స్థితి చక్కబడ ప్రారంభించింది. మీరు వెళ్ళిన తర్వాత గంటకు వారు నాతో ఇలా అన్నారు' ''ఏమే! ఇందాక మన యింటికి వచ్చిన వైద్యుడు మంచి మందు యిచ్చాడే! ఆ మందు తీసికొన్నప్పటి నుండీ నాకు చాల సుఖంగా ఉంది. ఆరోగ్యం కలుగుతుంది అని తోచింది'' అని. సంధించినప్పుడు వచ్చే ప్రలాపాలేమో అనుకొని వారితో-వైద్యుడూ లేదు-మందూలేదు. అది అంతా మీ పైత్య భ్రమ కాని, మాట్లాడక పడుకోండి.''-అన్నాను. కాని, ఆయన ఒప్పుకోక ''అలాకాదు చూడు, ఆ వైద్యుడు ఇక్కడ కూర్చొని, నన్ను ఇలా తాకి చూచాడు. నాకు మందు ఇచ్చాడు. ఆయన ఈరకం పంచె కట్టుకొని వున్నాడు, కండువా వేసుకొన్నాడు. ఈ విధంగా ఉంటాడు. అంటూ అచ్చం మిమ్ములనే వర్ణించారు. చాలా వింతగా ఉంది బాబుగారూ! లోనికి దయచేయండి. వారు చాలా కులాసాగా ఉన్నారు'' అంటూ లోనికి తీసుకొని వెళ్ళింది.

నేను లోనికి వెళ్ళగానే రాత్రి మహాప్రమాదంలో నున్న రోగి ఇప్పుడు మంచం మీద కూర్చున్నాడు. నన్ను చూడగానే నమస్కరించి 'అయ్యా! దయచేయండి. రాత్రి మీరువచ్చి రక్షించారు. మీరిచ్చిన మందు అద్భుతంగా పనిచేసింది. నాకసలిప్పుడు ఏమీ జబ్బు లేదేమో అన్నంతగా ఉంది' అన్నాడు. నేనామాటలు విని తెల్లబోయాను. ''నేనేమీ మందియ్య లేదే! ఈయన యిలా అంటాడే. ఇంకా యేమయినా పైత్యభ్రమలో నున్నాడా?'' అని తలపోశాను. వెంటనే నాలో మెరపు మెరసినట్లయింది, శరీరమంతా

ఘల్లుమన్నది. లోపల ఎవరో ప్రభోధించినట్లు తోచింది.

''ఏమీ మందియ్యలేదా? ఎంతో ప్రేమతో, దయతో, ఆర్ద్రతతో అయ్యోపాపం ఆయన బాధ తగ్గాలని నీవు ఆరాటపడితివే, అంతకన్నా మందేమిటి? ఆ సానుభూతిని మించిన ఔషధం ఇంకేదీ! నీలో వెల్లివిరిసే ప్రేమ అన్నింటినీ చక్కదిద్దగల దివ్యౌషధం'' అని.

అప్పటినుండి– స్వ,పర బేధాలు లేకుండా ఉపకారం చేయాలనే సత్సంకల్పం నాలో హత్తుకు పోయింది.

ధనసంపాదన తత్పరత్వమున వంతన్ సెంద నుద్యోగపుం
బెనుపుల్ వొందగ వందులన్, సుకవితావిద్యావిశేషమ్ములన్
ఘనతంగోరి తపింప నీపయి జగత్కల్యాణమ్మై పొల్చు నీ
యనవద్యస్థిర సత్కృపా గరిమయే యర్థింతు నాత్మేశ్వరా!

కమ్యూనిస్టులు దైవము లేడందురు. ఆ పార్టీకి చెందిన ఘనుడొకడు తన సిద్ధాంతమును లోకమున కెరిగించుటకై తన వాకిట నింగ్లీషులో "God is no Where" అని యొక బల్లమీద వ్రాసి కట్టినాడట. దానిని ఆంగ్లము బాగా చదువుకొన్న విద్యార్థి యొకడు నీ వ్రాతను బట్టి దైవమున్నాడని తెలుస్తోంది చూశావా? అంటూ అతనితో అని, "God is now Here" అని చదివాడట. అంతటితోనయినా ఊరుకోక సంస్కృతములో ''ఈశ్వరోనాస్తి'' అని వ్రాశాడట. సంస్కృతము చక్కగా చదువుకొన్న విద్యార్థి యొకడు దానిని చూచి 'ఈశ్వరో నా అస్తి' అని చదివాడట. 'నా' అంటే మనుష్యునిలోనే ఉన్నాడని అన్నాడు. ఈ బల్ల యెటుచూచినా చిక్కుగా నున్నదని ఆ తర్వాత ఆతడూరకున్నాడు.

ప్రకృతియంతా దైవమయమే. లేడన్నచోటనే సత్యపురుషుడగు దైవమున్నాడు.

# 5. దోషం ఎక్కడ?

ఆవేళ మధ్యాహ్నం నుండి మనస్సులో ఏదో చికాకు బయలు దేరింది ఆఫీసులో ఎక్కువగా పనిచేయడంచే మరీ యిదిగా ఉంది. దానికి తగ్గట్టు మధ్యాహ్నం సరిగా భోం చేయలేదు. ఆ విసుగుదలతో యింటికి బయలు దేరి వెళ్ళాను. నాతో ఇద్దరు ముగ్గురు కూడా వస్తున్నారు. ఇంటిలోని ప్రవేశించగానే మంత్రం పెట్టమన్న వ్యక్తి, ఇలా అన్నాడు.

''మా అబ్బాయి జ్వరముతో బాధపడుతున్నాడు. కాస్త మంత్రం పెట్టండి బాబయ్యా!'' అంటూ సాయంకాలం 4.30గం॥కు మాయింటి ముంగిట కూర్చుని ఉన్నాడొకడు.

మధ్యాహ్నం నుండి చీకాకుతో మనస్సు స్థిమితంగా లేక, విసుగుదలతో ''నాయనా! ఇప్పుడు కాదు నీ సంగతి, నీ కుఱ్ఱవాని జ్వరం సంగతి ఇప్పుడేమీ మాట్లాడలేను. అదీగాక –అసలే చీకాకుగా నున్నాను. రాత్రి 8గం॥కు రా– అప్పుడు నీ కుఱ్ఱవాని సంగతి చూస్తా'' అంటూ వానితో చెపుతూనే లోనికి వెళ్ళి మంచంమీద వ్రాలాను. కాస్త కాఫీ త్రాగిన తర్వాత ప్రాణం కుదుటబడ్డది.

'ఇవాళ ఆనందు స్కూలుకు పోలేదు' అని మావారన్నారు. కోపంతో 'ఎందుకు వెళ్ళలేదు? ఏం చేస్తున్నాడేమిటి?' అన్నాను.

'మధ్యాహ్నం నుండి చలిజ్వరంతో బాధపడుతున్నాడు. పొద్దున్న నుండీ తిండీ తిప్పలూ లేవు. కాస్త వాడికి ట్రీటుమెంటు చేయండ' ని అన్నదామె. 'సరే! ఇలా రమ్మను వాణ్ణి' –అన్నాను.

ఆనందు వచ్చి నా మంచం ప్రక్క కూర్చున్నాడు. 'నమస్కారం చేసుకో, జ్వరంతగ్గాలని' అని ట్రీటుమెంటు చేశాను. వాడికి జ్వరం తగ్గలేదు. నాకు యాక్షన్ జరగలేదు. అంతలో ప్రేయరు టైము కావచ్చింది. ఇద్దరు ముగ్గురు

...లొచ్చారు. నేను వారితో కూర్చొని యేవేవో మాటలాడు చున్నాను. ...లో ప్రేయరు టయిము అయింది. ఆనందుతో 'నమస్కారం చేసుకో' ...న్నాను. ప్రేయరు అయిన తర్వాత ఇద్దరు, ముగ్గురు తప్ప అందరూ ...పోయారు. అప్పటికీ వాడి జ్వరం తగ్గలేదు. 'తిరిగి నమస్కారం చేసుకొ' ...తక్కిన వారితో వీడికీ జ్వరం తగ్గాలని కోరుతూ నమస్కారం చెప్పి, ...మెంటు చేశాను. కాని యథా ప్రకారంగా భీష్మించుకొంది జ్వరం. ...కు చాలా ఆశ్చర్యం వేసింది. 'ఏమయ్యా! ఎన్నిసార్లు ట్రీటుమెంటు చేసినా ...రం తగ్గలేదే! కారణం ఏమి' టని వారల నడిగాను. వారు కానలేక పోయారు. ...గి నమస్కారం చేసుకో మన్నాను. యథాతథంగానే ఉంది జ్వరం. ...టికి రాత్రి 8గం॥ అయింది. తటుక్కున స్ఫురణకు వచ్చింది. ఇందాక ...యంకాలం 4.30గం॥కు ఎవరో 'మా అబ్బాయికి జ్వరం వచ్చింది. చాలా ...పడుతున్నాడు. కాస్త ట్రీటుమెంటు చేయ' మంటే విసుగుతో, ...డు కాదు రాత్రి 8 గం॥కు రమ్మని వానిని కసరి కొట్టాను. అదీ సంగతి.

...శారా! ఇందులో తమాషా, నాదే తప్పు. సాయంకాలం ఆనందుకు ...రం వస్తే ట్రీటుమెంటు చేయడం ఏమిటి? అంతకు ముందు వచ్చిన వ్యక్తిని ...రి పొమ్మనడం ఏమిటి? ఒకరికి 'నో' అంటే, రెండవ వానికి 'ఎస్' ఎలా ...తుంది? సత్యంగా, అశుచికి దూరంగా అసలు ఇంకా కొంచెం ...పోయి ఆలోచిస్తే అసలు మధ్యాహ్నం నుండి చీకాకు నాలో ఎందుకు ...గాలి? మన మనస్సు శుచిగా ఉంటే తలపులూ శుచిగానే ఉంటాయి. ...కులూ, కోపాలూ కలగాలనా భగవంతుని కోరుకొనేది? మనలో ఉండే ...పొచ్చాలూ, మాయ మర్మాలూ పోయి, ఎంతో హాయిగా చల్లగా ...యమయిన భావాలు కలగాలి. ఇతరుల బాధలను మనవిగానే ...కోవాలి. అప్పుడే మనం సత్యంగా ప్రవర్తిస్తున్నా మన్నమాట.

...వాడికి ట్రీటుమెంటు చెయ్యడం ఏమిటి, పాపం ఎంతో

బాధపడుతున్నాడనే ఫీలింగుతో, ప్రేమతో నాతో చెప్తే ఏదో బాధానివారణ కావచ్చుననే నమ్మికతో వాడు నాకోసం నిరీక్షించడం, నేను విసుగుదలతో కసిరి కొట్టడం ఎంత అపచారం. ప్రేమలో నాకు నావాడెంతో, పరాయి వాడూ అంతే! పోతే, స్వకీయ పర భేదాలుండ కూడదనేగా ఇన్నాళ్ళూ మనం తంటాలు పడుతూంట. కాబట్టి ముందర ఇందాక వచ్చినవాని కుఱ్ఱవానికి జ్వరం తగ్గాలనీ, తరువాత ఆనందుకు తగ్గాలనీ, అందులోను వీడు కూడా వాని జ్వరం తగ్గాలనీ కోరాలి. మనం కూడా వానికీ జ్వరం తగ్గాలనీ, త్వరలో రిలీఫ్ కలగాలనీ కోరుతూ నమస్కారం చేద్దాం. దాని వల్ల వానికి బెనిఫిట్టు కలిగితే, వాని ద్వారా వీడికీ కలుగుతుంది. తర్వాత కొంతసేపటికి ఆవ్యక్తికి జ్వరం తగ్గినట్టు తోచింది. ఆనందుకు జ్వరం తగ్గింది.

ఇంతట్లో ఇందాకటి వ్యక్తి వచ్చాడు. ''నాయనా నీసంగతే చెప్పుకొంటున్నాము. చాలా తప్పు జరిగింది. మీవానికి ఎలాగుంది జ్వరం?'' అన్నాను. ఏమీ తగ్గలేదన్నాడు. ''నీవు ఎంతసేపు అయింది ఇంటి నుండి వచ్చి? చాలాసేపు అయింది ఇంటి నుండి వచ్చి, ఇప్పుడు చూసి వస్తాను'', అంటూ వాడు యింటికి వెళ్ళి తిరిగివచ్చి సంతోషంగా 'జ్వరం తగ్గింది బాబయ్యా, కులాసాగా ఉన్నాడు' అన్నాడు.

అప్పుడీ పద్యభావం తోచింది.

వర్తింతున్ మత దేశ జాతి కృతముల్ వైవిధ్యముల్ వీడి, ని
ర్వర్తింతున్ బరిచర్య నార్తులకు యావత్ప్రజ్ఞ నర్పించి, యా
వర్తింతున్ గురుదేవ సూక్తములు భావస్ఫూర్తి నట్లయ్యు నే
ధూర్తుం డౌదు నొకొక్కచో, నడపు మీ తుందుడుక్కు నాత్మేశ్వరా.

ఒకవ్యక్తికే జరిగే రెక్టిఫికేషన్ మానవ జాతికంతకీ జరగాలి. మన సంకల్పాలను శుచిగాను, పరిశుభ్రంగాను పెట్టుకొని, ఒకప్రక్క కష్టాలు కలుగుతున్నా మంచికే అనుకొని పూనిక వదలక ఊపిరి ఉన్నంత వరకు ప్రయత్నం జరుపుతూ ఉండాలి.

# 6. మూలమేది

ఆసల్ రేపగ అంతరంగపు టరణ్యం బంధకారమ్మునన్
దాసోహమ్మని చొచ్చితిన్ వెదక నంతర్యామి నాలో నెదో
భాసిల్లెన్ జిఱువెల్గు, చేరc జన దావమ్మయ్యె నా యగ్నిలో
నే సోహమ్మయి నిల్చితిన్ బిదప నేదీ నాతనం బయ్యెడన్.

కొన్ని నెలలకు పూర్వం ఒకరు నాదగ్గరకు ట్రీటుమెంటుకు వచ్చారు. వచ్చినపుడాయన స్థితి యాందోళనకరముగనే యుండెను. అంతకు పూర్వం కొన్ని సంవత్సరాలుగా అజీర్ణము, నరముల బలహీనత మొదలగు వ్యాధులతో అయన బాధపడుతూండెడి వాడు. నా దగ్గరకు వచ్చునప్పటికి ఆయన స్థితి నాకెంతో జాలి గొల్పింది. ఏ పదార్థమూ తినలేడు. తిన్నా జీర్ణము కాదు. పైగా బాధ యెక్కువ. ఏది తిన్నా జీర్ణము కాదనే భయము. తానేదో మహా ప్రమాదస్థితిలో నున్నాననే యాందోళనలతో కుమిలిపోతున్నాడు.

అట్టి స్థితిలో ఆయన నా దగ్గరకు వచ్చినాడు. తనకున్న బాధలన్నీ వరుసగా ఏకరువు పెట్టనారంభించినాడు. అపుడు నేను ఆ పురాణ మంతా కట్టిపెట్టండి. మీకిదివరకటి అనారోగ్యం గురించి ఆలోచించకండి! మీ శరీరములోని అవయవాలు ఏవీ చెడిపోలేదు. అన్నీ సరిగానే ఉన్నాయి. ఇకముందు సరిగా ఉంటాయి. మీరలా కూర్చోండి, ''నమస్కారం చేసికొనండి'' అన్నాను. ఆయన అలాగే చేసాడు. కళ్ళు మూసుకొన్న కొంతసేపటికి ఆయన తనలోతాను నవ్వుకొనడం ప్రారంభించాడు. ప్రార్థన అయిన పిదప నేను 'నాయనా నీస్థితి యెట్లున్నది? సుఖంగా ఉన్నావా? ఇందాక ప్రేయరులో నవ్వుతున్నావేమిటి?' అని అడిగాను.

అపుడాయన 'నేను నమస్కారం చేసికొన్న కొలది సేపటికే నా శరీరంలో

ఎటువంటి జబ్బులేదని తోచసాగింది. అలా తోచగానే చాలా సంతోషం కలిగింది. ఆపుకోలేక నవ్వినాను' అన్నాడు.

సరే! నీవు సుఖంగా భోజనం చేసి సాయంకాలం గం॥6.10 నిమిషాలకు రమ్మని చెప్పి పంపాను. సాయంకాలం ఆయన వచ్చి తాను చాలా సుఖంగా వున్నాననీ, మధ్యాహ్నము హాయిగా భోజనం చేసి కమ్మగా నిద్రపోయాననీ చెప్పాడు. సరే, మంచిదన్నాను. ప్రేయరుకు ముందు ఆయనతో ''ఏమండీ! మీరిటకు వచ్చినపుడు చాలా అనారోగ్యంతో ఉన్నారు. ఇప్పుడు చాలా ఆరోగ్యంతో వున్నానంటున్నారు. ఇది అంతా ఆ ఈశ్వరశక్తి వలన జరిగినది కదా! మీ ఆరోగ్యం ఇంకా బాగా చక్కబడాలని దేవునికి నమస్కారం చేసి, కళ్ళుమూసుకొని కూర్చోండి'' అన్నాను.

అపుడాయన ''అయ్యా! మీరు చెప్పే ఆ 'దేవుడు' అన్న పదార్థాన్ని నేనెప్పుడూ చూడలేదు. ఉన్నట్లు నాకు తోచదు. అందువల్ల ఉన్నట్లు బుజావు కాని దేవునకు నమస్కారం చేయమంటే నేను చేయను. నాకు కనిపించే దేవుడు మీరు. మీ వలన నా శరీరారోగ్యం చక్కబడడం గుర్తిస్తున్నాను. కాన మీకు నమస్కారం చేయడానికి యెట్టి ఆక్షేపణా లేదు'' అన్నాడు.

నే నీ విధంగా అన్నాను.

''సరే, బాబూ! నీకేదో ఉపకారం జరిగింది. అది నావల్ల జరిగిందని గుర్తించావు. అందుకు కృతజ్ఞతగా నమస్కరిస్తా నంటున్నావు. సంతోషం. అసలు నీకు ఉపకారం చేయగల శక్తినాకెక్కడ నుండి వచ్చింది? నీవు ఎందరినో చూశావు. వారికి నమస్కారం చేశావు. వాళ్ళవల్ల నీకిట్టి ఉపకారం జరిగిందా? లేదు. లేకపోగా నా వలన నీకేదో కొంత ఉపకారం జరిగింది, అంటే అర్థం ఏమిటి? నాలో ఏదో ఒక అసాధారణమయిన శక్తి పనిచేయుచున్నదనియే కదా? అట్టి అసాధారణమయిన యోగ్యతను మినహాయిస్తే నీవూ, నేనూ,

...ట్లా ఉన్నవారూ ఒకటే కదా? అందువల్ల ఇక్కడ ఉన్న మనం కానిదేదో ...దివ్యశక్తి ఉంది. అదియే నీకుపకారం చేసింది. అంతేకాని నేను కాదు. నే ...శక్తికి వాహకుడను మాత్రమే. జనరేటరు నుండి మనం కావలెనన్న చోటికి ...గితీగెలు, విద్యుచ్ఛక్తిని మోసుకొని వస్తున్నవి. బ్రహ్మాండమయిన ...యంత్రాలను ఆ శక్తి త్రిప్పుతుంది. బరువుల నెత్తుతుంది. ఎన్నో విధాలుగా ...మానవులకు ఉపకరిస్తోంది. అందుకు మనం మెచ్చవలసింది రాగి తీగెలనా? ...జనరేటరు యంత్రాగారాన్నా? ఆ యంత్రాగారం నుండి వచ్చిన శక్తే కదా ...న్ని నాటకాలూ ఆడిస్తూంది. ఆ జనరేటరు నుండి ప్రసారం అయ్యేశక్తిని ...రాగి మొదలగు కొన్ని లోహపుతీగెలే మనకు అందియ్యగలవు. కొయ్య, ...పింగాణి మొదలగు వస్తువులు ఆ శక్తిని మనకందియ్యలేవు. జనరేటరులోని ...శక్తి మన ఉపయోగానికి సిద్ధంగా ఉన్నప్పటికీ కొయ్య మొదలగు కొన్ని ...వస్తువుల సహాయంతో మనం ఆశక్తిని పొందలేము. నీవు కొయ్యతో చేసిన ...పనిముట్ల సహాయంతో విద్యుచ్ఛక్తిని నీయింటికి తేవడానికి ప్రయత్నించావనుకో, అది నీ యింటికి వస్తుందా? అది నీకు ఉపయోగిస్తుందా? ఉపయోగించదు కదా? నీకుపయోగించలేదు కనుక, నీవు ఆ విద్యుచ్ఛక్తి యాక్టివిటీని ప్రత్యక్షంగా చూడలేదు గనుక, అసలు విద్యుచ్ఛక్తే లేదు. జనరేటరు యంత్రాగారమే లేదందువా? ఆ జనరేటరు ...ఉనికి తెలుసుకొనుటకుగాను నీవు యింటికి సరియగు ఫిట్టింగ్సు యేర్పాటు చేసుకోవద్దా? నీవు సరిగా ఫిట్ కానందువల్ల జనరేటరు నుంచి సహాయం పొందలేక, అసలా జనరేటరే లేదందువా? అథవా రాగి తీగల సహాయంతో విద్యుచ్ఛక్తి నీకు వచ్చి సహాయపడుతుందను కొనుము. అపుడు 'నాకు జరిగే ఉపకృతి అంతా యీ తీగెల నుండే జరుగుతూంది. ఈ తీగెలే నాకుపకృ...తి చేయుచున్నవి. అందువల్ల యీ తీగెలకే కృతజ్ఞుడను గా వుంటాను. అంతేకాని అసలు పవరు సెంటరు ఉన్నట్లు నేను గుర్తించను' అంటావా?

జనరేటరు యంత్రాగారం అనేది ఒకటి, ఉన్నట్లు మనం గుర్తిస్తున్నాము కదా! ఉన్నట్లు కూడా అంగీకరిస్తున్నాము కదా! అలాగే ఈశ్వరశక్తి యొక్క నిర్వాకమును బట్టి ఈశ్వరుడున్నాడని మనం గుర్తించగలము. ఈశ్వరశక్తి యొక్క యాక్టివిటిలో మనకు కొన్ని లోపాలు కనిపించుతున్నాయి. అందుకు మనం బాధ్యులం కానీ, అదికాదు. స్వచ్ఛమైన పాలు, మురికి సీసాలో పోస్తే పాలు మురికిగానే కనిపిస్తాయి. ఆ మురికి సీసాదా? పాలదా? దీపానికి పెట్టిన గ్లాసు, మురికి వల్ల లోని ప్రభను మనం సరిగా గుర్తించలేము. ఆ గ్లాసును శుభ్రంగా కడిగి, శుచిగా ఆరబెట్టితే ఆదీపం, కాంతులను చుట్టూ వెదజల్లుతుంది.

కనుక ఇక్కడ ప్రార్థనకై సమావేశమయిన మనకందరకూ కలుగు 'బెనిఫిట్' అంతా ఆ దివ్యశక్తి నుండి వచ్చిందే! మనల్ని చుట్టుకొను బాధలన్నీ స్వయం కృతాపరాధాలే, ఇదిసత్యం' అని.

తరువాత, 'ఏమయ్యా! నేను చెప్పినదంతా విన్నావా? అర్థ మయిందా?' అన్నాను. అప్పుడాయన 'నేను సరిగా వినలేదండీ. అసలు వినాలని కోరికా లేదండీ. మీరు చెప్పేదంతా ఏదో గొడవగా ఉంది. నాలుగవ తరగతి పిల్లవాడు, ఎం.ఏ. క్లాసులో కూర్చొని, చెప్పే పాఠం వింటూంటే ఎంత అర్థమవుతుందో, మీరు చేప్పేదీ నాకంతే అర్థమవుతూంది' అన్నాడు. 'సరే! పోనీవయ్యా' అని ఊరుకున్నాను. ఆ మిత్రుని ఆరోగ్యము కొంత చక్కబడింది.

ఈ ప్రార్థనకు తోడు ఏదైనా మందు తీసుకొంటే తన ఆరోగ్యం ఇంకా త్వరగా నయం అవుతుందనే పేరాశతో అతడొకనాటి రాత్రి మందు తీసుకొన్నాడు. ఆయనకెప్పుడూ మందులు తినే పరిపాటి. పాపం! ఆ మందు తిన్న సంగతి మరచాడు. రాత్రి కొంతసేపయాక కడుపులో విపరీతమయిన బాధ, తాపం బయలుదేరిందట. దానికి తట్టుకోలేక అర్థరాత్రివేళ ఆయనగారు మాయింటికివచ్చారు. 'ఏం నాయనా? ఇప్పుడిట్లా

అసహ్యంగా వున్నాడనీ, తక్కువ వాడనీ కదా? దీన్ని సూక్ష్మంగా పరిశీలిస్తే ఇందులో తక్కువ వారెవరు? నేనేదో అధికుడను అనే దురహంకారం లోనే తక్కువతనం, అల్పత్వం ఇమిడి వుంది. మనం అందరినీ సరి సమానంగా చూడగలగాలి. అహం...కాదు; అందరికంటే మనలను అధమాధముడుగా చూసుకోవాలి. మనం పాకీ వాని కంటే తక్కువ లెవల్‌లో ఉన్నట్లుగా భావించాలి. అటువంటప్పుడే మనలోని లోపాలను మనం గుర్తించి దిద్దుకోగలుగుతాము. అప్పుడే మనచుట్టూ ఉన్నవారిని ప్రేమించి, ప్రేమ పుచ్చుకోగలుగుతాము. నేనధికుడననేవాడు తన్ను తానే దిద్దుకోలేడు, ఇక యితరులను యేం చక్కదిద్దుతాడు?

# 7. ఈశ్వరానుభూతి

ఓ! విశ్వేశ్వర! యో పరాత్పరతరా! యో సర్వనిర్వాహకా!
దేవా! నా పరిదేవితంబులకు నేదీ తగ్గ ప్రత్యుత్తరం?
బూవిస్ఫూర్తి వాస గొల్పితివి; యేమో యేమొ యత్యద్భుత
శ్రీ విస్ఫూర్తులు తోప జేసితివి తత్సిద్ధిన్ విడంబింతునా?

"క్షిపత్ర లోకశోక మడగింతును మిమ్ము సముద్ధరింతు" నం
చప్రతిమ ద్యుతిస్ఫురణ నక్షర రూపమునన్ ననున్ ప్రబో
ధ ప్రతిపన్ను జేసి పరితాపము వాపి యిదేమి మోసపుం
గొప్రము పెట్టి తిప్పు తలకుం గడకుం జగదేక నాయకా?

నాకు నాలుగు రోజుల నుండి శరీరంలో సుస్తిగా నుండెను. ఏదో శరీరంలో అల్లకల్లోలముగా యాక్షన్ జరుగు చుండెను. మనస్సులో యేదో అశాంతి, శరీరంలో ఫలానా అని వర్ణింపరాని ఏవేవో బాధలు, మూలాధారం పైకై శరీరమంతా అలజడి కల్గిస్తూ ఉంది. ఆ అలజడి యీ రోజు ఉదయం కాస్త తగ్గింది. నా తీరును పరికిస్తున్న స్నేహితు డిలా ప్రశ్నించాడు.

"ఏమండీ! మిమ్ములను ఆశ్రయించిన మాబోంట్ల కెందరికో ఉపకారము జరుగుతూంది. శరీరంలోని బాధలు, మానసికమయిన యాందోళనలు సర్దుబాటయి, మాలో ఆనందం వెల్లివిరియు చున్నది. ఆ ప్రేమ మయమయిన ఈశ్వరశక్తి మీలో నెలకొని యీ పనులనన్నిటినీ చేయించు చున్నదని నమ్ముచున్నాము. ఆ దివ్యశక్తి శాంతినీ, సౌఖ్యాన్నీ, మీ ద్వారా మాకందిస్తూనే, మీకింత అలజడి కల్గించడం దేనికి?"

అవును నిజమే, ఆ దివ్యశక్తి యెపుడూ దివ్యమైనదే, ప్రేమమయమైనదే. ఆందోళనలకు, బాధలకు ఇచట తావేదీ? లేదు. అయినా నేనిలా ఆందోళన చెందుతున్నాను అది యెందుకో.

''సృష్టిలో ఇంత వఱకెవరూ ఈశ్వర తత్వాన్ని ప్రత్యక్షంగా చూచి ఎరుగరు. ఏదో యోగసమాధిలో ఎవరో కొందరు మహర్షులు చూచి యుందురేమో? అయినా ఆ సమాధి నుండి వెలువడి మామూలు ప్రజ్ఞ లోనికి రాగానే ఆ ఈశ్వరానుభూతి 'కంటిన్యూ' కావడం లేదు కదా! ఆ సమాధిలో లేనప్పుడు సుబ్బన్న, సుబ్బన్నగానే ఉన్నాడు. అందువల్ల సమాధిలోని అతని యనుభూతి సత్యమూ కావచ్చు. లేక భ్రాంతీ కావచ్చు.

''అర్జునుడు కురుక్షేత్ర యుద్ధారంభంలో తన యెదుట మోహరించిన బంధు మిత్రాదులను చూచి ప్రేమ విహ్వలుడైనాడు. ''అయ్యో! అన్నదమ్ములను, తాత-తండ్రులను ఈ క్షుద్రరాజ్య కాంక్షకై యెట్లు బలిపెట్టుదును?'' అని నీరయినాడు. అట్టి వానిని ప్రభోధించుటకై శ్రీ కృష్ణుడు అర్జునునకు విశ్వరూప సందర్శనమిచ్చినాడు. ఆ దివ్యానుభూతి అర్జునునెక్కడకు తీసుకెళ్ళింది? అతడు ఎట్టి ఉన్నత స్థితికి వచ్చినాడు? అతనిలో మహోజ్వలమైన మార్పేమీ కలగలేదు. క్షణికమైన ఆ విశ్వరూప సందర్శనము అర్జును నర్జుననిగానే యుంచినది. అతడందఱి తలలు నరికినాడు. అట్టి దివ్యానుభూతికి ప్రతిఫలం ఇదేనా? కాదు. కాకూడదు. అర్జునునిలో ఆ దివ్యానుభూతి స్థిరంగా నెలకొని ఉన్నట్లయితే ప్రేమ మయుడు, ఆనంద మయుడు, జ్ఞానస్వరూపుడు అయ్యేవాడు అర్జునుడు. ప్రేమను, ఆనందమును, చుట్టూ వెదజల్లేవాడు. కర్ణ, దుశ్శాసనులను, నకుల సహదేవులను ఒకటిగా భావించి ప్రేమతో ఆదరంతో కౌగిలించేవాడు. అసలు భారతయుద్ధమే జరిగేది కాదు.''

'కనుక మనం ఈ శరీరంలోనే యీ ప్రజ్ఞ ఇలా పని చేయుచుండగనే ఆ ఈశ్వరానుభూతిని పొందగలగాలి. అలా పొందుటకే మనం ఈ ప్రేయరు సహాయంతో సర్వదా ప్రయత్నం చేస్తున్నాము. మనయొక్క ప్రతి యక్ష్నీరియన్సు మనలను దాని సామీప్యానికే తీసికొని పోతూంది. అలా

మనం లోపలకు, ఇంకా లోపలకు, మరీ ఇంకా లోపలకు పోవుటలో ఎన్నో రకాల 'డిస్టర్బెన్సెస్'(చీకాకులు) తటస్థిస్తుంటాయి.

మనం నీరు సంపాదించడానికి బావిని త్రవ్వనారంభిస్తాము. ముందు మట్టి, రాళ్ళు, బురద వస్తుంది. నీటికై త్రవ్వగా బురద వస్తున్నదని నిరుత్సాహపడి మానుతామా? ఇంకా ప్రయత్నం చేస్తాము. క్రింద నున్న రాతి ప్రదేశమును గునపముతో పగులగొట్టి దానిని ఎత్తి వేస్తాము. అపుడు కొంచెము కొంచెముగా నీరూరుతుంది. మట్టి, యిసుక, రాళ్ళతో కలిసి ఆ నీరు చాలా మురికిగా ఉంటుంది. అయ్యో! త్రాగడానికై యింత కష్టపడి బావిని త్రవ్వగా, ఇట్టి మురికి నీరు లభించింది. ఇది త్రాగడానికి పనికి రాదు. మన పని అంతా వ్యర్థమయింది అని నిరుత్సాహ పడుతున్నామా? పడము; ఇంకా ఉత్సాహంతో క్రిందనున్న రాతిని కష్టపడి పగులగొట్టి ఇంకా లోతుకు పోతున్నాము. నీరు కొంత అధికంగా ఊర నారంభిస్తుంది. అయినా మురికిగానే ఉంటుంది. ఆ మురికి నీరంతటినీ తోడిపైచి యింకనూ రాళ్ళను పగులగొట్టి లోతునకు పోయినచో మన కష్టము ఫలించును. ఎంత తోడినను తరుగని, రుచి గల, చల్లని నీరు మనకు లభిస్తుంది.

అటులనే మనము ఈశ్వర సాన్నిధ్యానికై పురోగమించేటప్పుడు ఎన్నో కల్లోలములు బయలు దేరుతాయి. మన ప్రజ్ఞ అంతర్ముఖమయి సూక్ష్మంగా యింకా సూక్ష్మంగా 'డీప్' గా పో ప్రయత్నించే కొలది– మనలోని చండాలం అంతా విజృంభిస్తుంది. అంతమాత్రాన మనం నిరుత్సాహ పడకూడదు. ఆ విజృంభణం తగ్గి కొంత తేరుకొన్న తరువాత కొంత ఆనందం ఇస్తుంది. కొత్త 'ఎంకరేజ్మెంటు' లభిస్తుంది. మనం ఇంకా లోతుకు పోయినపుడు మనలోని ఈర్ష్యాసూయలు చెలరేగి మనలను అధోగతికి త్రోసివేయ ప్రయత్నించును. వాని నన్నింటిని 'ప్రేమ' అనే సాధనంతో 'బోర్' తీసుకొంటూ వెళ్ళితే మనం దివ్యశక్తి అనే నీటి యూటను అందుకొనగలము.

# 8. వింతలో వింత

వెన్నుం గానగలేని కన్నులివి యీ విశ్వ ప్రపంచార్థ పుం
దెన్నుం గానగ నేర్చునే? కటకటా దేవాధిదేవుం డొకం
డున్నా డన్నిటి కాదిమూల మత డేదో కార్యముఊహించి యీ
యన్నింటిన్ సృజియించె నందు రది య ట్లెయుండు టెట్లోగదా!

"మన తండ్రియగు ఈశ్వరుడు ఎన్ని వింతపనులు సంతరిస్తున్నాడో చూడండి! నాయెదుట నున్న ఈ 'చీని'(బత్తాయి) పండును చూశారూ! మనం కన్నులుండీ చాలా విషయాలు చూడం. అలా చూడకుండా ఉండడానికే అలవాటు పడ్డాము. ఈ పండును ఉపయోగించే మన కొరకై ఎన్ని జాగ్రత్తలు తీసికొన్నాడో చూడండి ఈశ్వరుడు! పై చర్మము గట్టిగా ఉంచి, ఒక విధముగు నూనెతో నింపినాడు. అందుచే అది ఎండకూ, వానకూ తాళగలుగుతుంది. దానికి లోపల మెత్తటి దిండు వంటి తడి,పొడి కానటువంటి పదార్థాన్ని పెట్టినాడు. పండు గాలికి యిటూ అటూ కొట్టుకొన్నా, కంది లోపల రసము చెడకుండా నీ దిండ్ల నమర్చినాడు. లోపల చిన్న చిన్న గదులుగా తొనల నమర్చినాడు. ఆ తొనల నిర్మాణంలో ఎంతో వింత నైపుణ్యం ఉంది. నెలవంక లాగా తొనలను మన పెదవుల ఆకారానికి సరిగా యిమిడ్చి రసాస్వాదన కనుకూల పరచినాడు. ప్రతి తొనలో మరి యెన్నెన్నో జాగ్రత్తలు. రసము చిన్న చిన్న గుళికలలో నింపి యొకదానిపై నొకటి కలగ పులగంగా పేర్చి, అవి అటూ ఇటూ కదలిపోకుండా గట్టి కవరుపైచి బిగించినాడు. ఇట్టి తొనలనన్నింటిని వలయాకారానికి సరిపెట్టి ఒక బంతిలా అందంగా ఉండునట్లు చేసినాడు. దాని రంగులో ఎంత ఎట్రాక్షన్ ఉంది. రసము తేలికగా, ఎంతో రుచిగా, ప్రాణప్రదంగా కూర్చినాడు. చేతులు తడి కాకుండ, రసమొలుక కుండా యీ పండ్లను చక్కగా జేబులోవేసికొని

ప్రయాణం సాగించవచ్చును.

ఈ ఈశ్వర నిర్మితమైన ఈ సోడాబాటిల్ ను ఎక్కడకు తీసుకు వెళ్ళినా, ఎటువంటి ప్రమాదం సంభవించదు. చేజారినా చిక్కులేదు. కానీ మనం తయారు చేసిన సోడాబాటిల్ మహాడేంజర్. కొంచెం అజాగ్రత్తగా ఉంటే కొంపకూలుతుంది. దాని యోగ్యత అట్టిది. మన యోగ్యత యిట్టిది. మనకు పనికిరాని చెత్త, చెదారం, నీరు ఆ చీనీ చెట్టుకింద పారవేస్తున్నాము. చెట్టు ఆ చెత్త, చెదారం నుండే రసము గ్రహించి తన బోదెను, శాఖలను, రెమ్మలను, చిగుళ్ళను, పూవులను, పండ్లను ఇస్తూంది. ఈ వింత 'ఫ్యాక్టరీ' లో జరిగే విశేషాలు గమనిస్తే ఎంతో ఆశ్చర్యం వేస్తుంది. ఈశ్వరశక్తిని గుర్తించి విస్తుపోతాం. మనము పారవేసిన చెత్త నుండి యిన్ని పదార్థాలెట్లు వచ్చినవి? కొమ్మ, రెమ్మ, చిగురు, పూవు, పండు, రంగు, వాసన అంతా వ్యత్యాసాలే. ఇన్ని మార్పులెవరు చేసినారు? ఇన్ని రుచులెవరు కల్పించినారు? ఇది అంతా మనము గమనించు చున్నామా? లేదు. అందువలననే మనం కనులుండీ కానలేని గుడ్డివాళ్లంటున్నాను'.

నారలు కట్టుచీర; లశనంబులు కాయగసుళ్ళు; కొండలున్
కారడవుల్ నివాసములుగాఁ దపియించి మహర్షు లెవ్వరిన్
జేరుకొనం దలంచి రల చిన్మయ తత్త్వము సర్వమానవో
ద్ధారము గోరి కొన్న యవతారము మద్గురుమూర్తి గొల్చెదన్.

# 9. శృతి–అపశ్రుతి

నావద్దకు ట్రీటుమెంటుకయి ఇద్దరు వ్యక్తులు వచ్చారు. అందులో ఒకాయన సామాన్య కుటుంబీకుడు. రెండవ ఆయన అధికార పదవిలో ఉన్నవాడు. సంపన్న గృహస్థుడు...

సామాన్య కుటుంబీకుడు చాలా రోజులుగా అనారోగ్యంతో బాధపడుతూనున్నవాడు. అనారోగ్యానికి తోడు తొడపై పెద్దకురుపు. ఎటూ కదలలేడు, మెదలలేడు. భోజనం లేదు. ఇట్టిస్థితిలో ఆయన నా దగ్గరకు వచ్చాడు. అంతకు పూర్వం ఎన్నో మందులూ, మాకులూ తిన్నాడు. తిన్నా ఫలితం దక్కలేదు. ఆఖరు 'స్టేజి' లో ఇక్కడకు వచ్చాడు. ఇప్పుడాయన స్థితి 'నీవే తప్ప యితః పరం బెరుగ' అన్న పోతన్న గారి గజేంద్రుని స్థితిలో ఉంది. నా వద్దకు వచ్చి జపం చేసుకొంటే, తనకేదో ఉపకారం జరుగుతుందనే నమ్మకతో, ఆశతో వచ్చినాడు.

ఇక సంపన్న గృహస్థుని స్థితి. అతడేదో ఉద్యోగి. ఒకరిద్దరు బంట్రోతులు, ఉంటవాడు, పెద్ద కుటుంబంతో ఇటకు వచ్చినాడు. ఆయనకేదో కడుపులో కొద్ది జబ్బున్నది. అది అట్టే బాధ కలిగించేదీ కాదు. ప్రమాదం కలిగేదీ కాదు. కొంచెంగా బాధమాత్రం కలిగిస్తూ ఉంటుంది. ఆయన సాయంకాలం మాయింటికి వచ్చి కూర్చున్నాడు.

'ఏం నాయనా! ఏం పనిమీద వచ్చారు' అన్నాను. ఆయనగారు 'అవునండీ నేను మీదగ్గర కొస్తున్నానని జాబు వ్రాశాను, అది చేరే ఉంటుందనుకుంటాను', నేను ఫలానా ఉద్యోగిని ఊరూ, పేరూ ఫలానా అని చెప్పాడు.

'సరే, బాబూ! అసలు మీరిట కెందుకొచ్చారు?' అన్నాను.

'ఆ, ఆఁ... ఏమీలేదండీ! నాకు నాలుగు సంవత్సరాల నుండి కడుపులో

నొప్పిగా ఉందండి. దానికేదో వైద్యాలు చేశానండి. బొత్తిగా లాభం లేక పోయింది. మా స్నేహితుడొకాయన మీరేదో ట్రీటుమెంటు చేస్తారని చెప్తే సరే అదీచూద్దాం అనే తలపుతో వచ్చాను' అన్నాడు.

'సరే చూడండి! నాకేం ఆక్షేపణ లేద'న్నాను. ఆయన ప్రేయరులో కూర్చున్నాడు. నమస్కారం చేసుకొన్న కొద్ది నిమిషాలకే ఆ సంపన్న గృహస్థు కండ్లు తెరచి చుట్టూ వున్న వారివంక పరకాయిస్తున్నాడు. రెండవ ఆయన ప్రేయరుకు కూర్చున్నప్పుడు కండ్లు మూసుకొని క్రమ క్రమంగా ఒకప్రక్కకు ఒరిగి క్రింద పండుకొన్నాడు. ఆయనలో ఏదో తీవ్రమయిన యాక్షన్ జరుగుతోంది. ప్రాక్టీసు అయిన తర్వాత కూడా ఆయన యింకా అలానే పండుకొన్నాడు. నేనా సంపన్న గృహస్థుతో 'ఏం నాయనా! సుఖంతో ఉన్నారా? కళ్ళు మూసుకొన్నప్పుడు మీలో ఏమి జరిగింది? కడుపులో బాధ సర్దుకొందా? అన్నాను. ఆయన 'నాకేమీ తెలియ లేదండీ! నమస్కారం చేసుకొనుటకు ముందు ఎలాఉన్నానో ఇప్పుడూ అలాగే వున్నాను. కడుపులో బాధ అలాగే వుంది' అన్నాడు. ప్రార్థనానంతరం రెండవ ఆయన లేచాడు. ఆయన్ను అడగ్గా ''ఇదేదో చాలా వింతగా ఉంది స్వామీ! నాకెన్నాళ్ళనుండో నిద్ర సరిగా లేదు. ఇప్పుడు నమస్కారం చేసుకోగానే చల్లగా, హాయిగా నిద్ర వచ్చింది. బాధలేమీ తెలియలేదు. ఇప్పుడు చాలా ఉత్సాహంగా వున్నాను'' అన్నాడు.

తర్వాత సంపన్న గృహస్థులో మార్పేమీ లేదు. రెండవ ఆయన నడవలేక మొదట బండిలో వచ్చాడు. తరువాత ఉదయం మెల్లగా నడిచి రాగలిగాడు. మూడో పూటకు పెళ్ళికొడుకులా నడిచి వచ్చాడు. ఆయనలోని అనారోగ్యం చాలాభాగం పోయింది. ఆయన ముఖవర్చస్సే చెబుతూంది. వీరిద్దరూ ఇక్కడ ప్రేయరు చేసుకొన్నారు. అందు ఒకరి జబ్బు పోయినట్లు కనబడుతూంది. ఇంకొకరికి ఏమీ ఉపయోగించ లేదు. ఇదియేమిటి? ఈ విషయాన్ని అతి

సూక్ష్మంగా 'ఎనలైజ్' చేసి చూస్తే ఎన్నో వింతలు గోచరిస్తాయి.

పాటకచ్చేరీ చూడండి– పాటకుని శ్రావ్యమైన కంఠము, మార్దంగికుని వాయిద్యము, ఫిడేలువాని వంతపాట, ప్రక్కతాళము, ఈ నలుగురి సమ్మేళనమే మేళము. ఇందు ఎవరు అపమార్గంలో పడినా కచేరి రసాభాస మవుతుంది. ఫిడేలు వాడొకదారి, మార్దంగికు డొకదారి పట్టిన, పాటకుడు ఎంత గొప్పవాడైనా యేమి చేయగలడు? అతని పాట మనకానందము నీయజాలదు కదా! ఈ సాధనములన్నీ కలసిన గదా రమ్యత!

మన యీ యోగమార్గమూ అట్టిదే. ఈశ్వరుడనే పాటకుడు అమృత మయమయిన గానాన్ని మనకు వినిపించాలని యెప్పుడూ గానం చేస్తాడు. మన అవివేకం వల్ల ఆ గానమాధుర్యాన్ని విని ఆనందించకుండా పెడచెవుల పెడుతున్నాము. ఆ పరతత్వము దయామయమయినది. 'ఓషన్ ఆఫ్ లవ్' కనుక మనకు అన్ని విధములా మేలు చేకూర్చచూచును. పాలు చేపునకు వచ్చిన తల్లి, బిడ్డ ఎప్పుడు తనవైపునకు తిరిగి స్తన్యం గ్రోలునా అని ఎదురుచూచుచుండును. బిడ్డ స్తన్యము నాస్వాదింప కున్నదే యని ఆమె పరితపించును. అజ్ఞానముచే శిశువు అటు ఇటు చూచుకొనుచు వలసిన దానిని గ్రహింప నేరదు. బిడ్డ కోరినపుడు కోరినదంతయు నిచ్చుటకు మాత సంసిద్ధురాలే! ఆ పరతత్త్వాన్ని 'తండ్రీ! నన్ను రక్షించు' అని అమాయికంగా కోరుకుంటే– అదియే అన్నిటినీ చక్కదిద్దుతుంది.

అనారోగ్యంతోటి, తొడపైన పెద్దకురుపుతోటి బాధపడుతూ వచ్చిన ఆయన కథ చూడండి, చాలా 'క్విగ్గా' 'యాక్షన్' జరిగింది. బాధ తొలగింది. ఆ తగ్గడం అలా శృతి కలయడం వల్లనే కదా!

ఇక రెండవ ఆయనలో ఏదో అపశృతి ఉంది. నేనధికారిననీ, ధనవంతుడననీ, యీ బీద తెలుగు శాస్త్రుల్లతో ఏమిటనీ? ఇల్లా రావయ్యా– ఏదో ఒక మంత్రం వేసిపోవయ్యా అంటే ఆయనే వస్తాడు. మంత్రం వేస్తాడు.

ఆయనకేదో పదిరూపాయలిద్దాం అనే ఫోజులో వచ్చాడు. ముందు ఫలానా ఉద్యోగస్థుణ్ణి అని చెప్పాడు. కబుర్దార్ అన్నట్టు. తరువాత తన ఊరూపేరూ చెప్పి– చిట్టచివర తన బాధను గూర్చి చెప్పాడు. నమస్కారం చేసుకొన్న తర్వాత చిట్టచివర ఆయనకేమీ జరగలేదంటే యేలా జరుగుతుంది? బిడ్డ పాలు త్రాగక అటూ యిటూ కోతి కొమ్మచ్చులాడు తుంటే తల్లి మాత్రం యేం చేస్తుంది గనక!''



పూర్వపు గ్రంథాల నుండి మాష్టరుగారు ఎప్పుడూ కోటు చేసేవారు కారు. భగవద్గీతలో యిలా చెప్పింది. ఉపనిషత్తులు ఇలా అంటున్నాయి. వేదాల భావాలు ఇవి అని యెప్పుడూ అనేవారు కారు. వాటి ప్రసక్తి వచ్చినా అంగీకరించేవారు కూడా కారు. మాస్టరు, 'నాకిలా తోస్తుంది. ఇలా చేయడం మంచిది. ఇలా చేయకూడదు' అనే చెబుతూండేవారు. మనుస్మృతి, భగవద్గీత ఇత్యాదులు వ్రాసినవారు అప్పటి దేశకాల పాత్రా నుసారంగా వ్రాశారు. దేశం, కాలం, పాత్రత మారినందు వల్ల వాటి విలువలూ మారినాయి. అందువల్ల ఆ పుస్తకాలపై ఇప్పుడాదరం చూపడంలో సామరస్యం ఏమీ లేదు. వాటికేదో కొంత విలువ వుంది. అంతవరకే గుర్తిద్దాం. ఆ పాతపుస్తకాలు చదివినందువల్ల మన ప్రశ్నలకు సమాధానాలు రావు. మన శరీరమనే పుస్తకాన్నే మనం కేర్‌ఫుల్‌గా చదివితే ఎన్నో మంచి సమాధానాలు వస్తాయి. అందువల్ల నేనెప్పుడూ నా శరీరమనే పుస్తకాన్నే చదువుతాను, పూర్వగ్రంథాలు చదవను. చదివినా వాటికి ప్రాధాన్యమివ్వను.

నా సంకల్పము లేను గన్గొనినవింతల్ సుంతయేన్ దోషమూ
యా సంసర్గము లేనిపేయగుట తథ్యం బంటకున్ మన్మనో
వ్యాసంగంబును పుణ్యసాధ్వి మటి యయ్యెచోటలున్ సాక్షు లిం
దే సందేహము కల్గజేసితివి యింకే మందు నో ఈశ్వరా!

# 10. సాయంకాల ప్రార్థనలో

లోకములో దైవమును కనుగొనుటకయి యెన్ని విధాలైన మార్గాలున్నా యంటున్నారో, వాటి యన్నింటి శక్తినీ సమీకరణము చేసి ఒక యాకారము ఏర్పరచినచో నాయాకారమునకు శీర్షము నందీ లైనున్నది. దివ్యజ్యోతిని వెలిగించుచు సద్భుతమగు శక్తితో భగవంతుని చూపుచున్నదీ యోగమార్గమొక్కటే!

ఎంతో ఆస్వాద్యముగా, అందముగా 'ఫస్టుక్లాసు' రుచితోనున్న జహంగీరు మామిడి పండును తీసికొందము. ఆ ఫలమున కట్టి యోగ్యతలు కలుగుటకు ముందు ఎన్నో ప్రయోగాలు జరిగినాయి. ఒక చెట్టు పండు తీయగా వుండి ఆకారము చిన్నదిగను, పీచు అధికముగను నుండవచ్చును. ఇంకొక రకము పీచులేక పెద్ద యాకారమున నుండి రుచి పుల్లగ నుండవచ్చు. ఇవి అన్నీ సరిసమానముగ నుండి, కంటి కసహ్యము కల్గు రంగు కలిగి యుండవచ్చు. అంతా సరిగా వున్నా ఆ పండు వాసన యింపైనది కాక పోవచ్చు. ఎందరో తోటమాలులు ఎన్నో ప్రయోగాలు చేసి, మంచి వాసన లభ్యపడేటట్టు, కంటి కింపగు రంగు, పంటి కింపగు రుచి కల్గు లాగున ఈ జహంగీరు మామిడి యంటును సిద్ధ పరచినారు. మనకు మొదటి తోటమాలులు చేసిన ప్రయోగములతో నిక పనిలేదు. సరాసరిగా జహంగీరునే పండించ వచ్చును. దానికి యింకను క్రొత్తరుచి, క్రొత్త యాకారమును కల్పింప వచ్చును. ఇంతకన్న కొరతగిన రుచిలేదు. సువాసన లేదు. అందములేదు– అనే స్థితికి మనము పో ప్రయత్నింప వచ్చును.

అలాగే, సృష్టియాది నుండి పలువురు సృష్టికర్తను తెలుసుకోవడానికై పలువిధాలైన ప్రయత్నాలు చేసినారు. ఆకసము నుండి కనిపించు చింతలను, మేఘములను, మెరపులను, వర్షమును ఈశ్వర విలాసముగా

తొలుత తలచిరి. కొండలు, నదులు, సముద్రములు ఏతదంశములుగనే భావించి పూజించిరి. తృప్తినందక యా ఈశ్వరశక్తి ఇన్ని రూపములుగా నుండదు. సృష్టి, స్థితి, లయములను మూడు రూపములుగా కనబడుచున్నవి. కనుక బ్రహ్మ, విష్ణు, ఈశ్వరుడు అని పేర్లు పెట్టెదమని భావించినారు. ఆ తర్వాత ఉపనిషత్కారులు, మహర్షులు ఈ మూడు తత్త్వముల మూలమొకటేనని తెలిసికొన గలిగి నారు. ఇట్లు అనేక దశలుగా మెట్టుపైమెట్టుగా పరంపరగా వచ్చిన జ్ఞానము యొక్క చివరిమెట్టు అగు సంధ్యా వందనాదులు, భగవద్గీత ఇత్యాదుల కందిన మెట్టుకు పై మెట్టుపై నుండి మనయోగం ఆరంభమైంది.

చిల్లర దేవతల పూజించుట, యజ్ఞయాగములు చేయుట, త్రిమూర్తుల విగ్రహారాధనము, జపతపములు, భజనలు వగైరాలు చేయకయే మనము ఈ యోగమార్గము వలన పైవాటి ఫలము పొందవచ్చును. ఈ యోగ మార్గములో ప్రతిపాదింపబడే 'ప్రేమ' అనే తత్త్వములోనే అవియన్నియు యిమిడి యున్నవి. అవి యన్నియు నీయగలిగిన సత్ఫలమును ఈ ప్రేమతత్త్వ మొకటియే ఇపుడు నీయగలుగుచున్నది. బ్రహ్మసాయుజ్యము నందుటకై మన మీయోగ మార్గమున పురోగమించి మరణరాహిత్యమును పొందవచ్చును.

ఈశ్వరుడు ప్రేమ మయుడు, కరుణామయుడు. కానీ, యీ ప్రకృతి యటువంటిది కాదు, కాకపోగా పైపెచ్చు అందుకు విరుద్ధ మయినది సత్పురుషుడు, ప్రేమమయుడు అగు భర్త, –తెలివిలేని, గయ్యాళి భార్య దాంపత్యము వంటిదీ స్థితి. అజ్ఞానము వలన భార్య ఎంత హంగామా చేసినప్పటికీ, భర్త ఎంతో ప్రేమతో చక్కదిద్దటానికే ప్రయత్నిస్తాడు. శిక్షించడానికిగానీ, డిస్ట్రాయ్ చేయడానికిగానీ ప్రయత్నించడు. ఎంత ఎగిరి పడినా ఆ ప్రేమ తత్త్వమునకు లోబడియే 'ప్రకృతి' అనే భార్య ఈశ్వరుడి

భర్తను చేరుతున్నది. చాపల్యము వలన విడిపోవుచున్నది. అది ఎన్ని వికారములు చేసినప్పటికి ఎంత కోతికొమ్మచ్చు లాడినప్పటికీ ఈశ్వరుడు దానిని బుజ్జగించి ప్రేమిస్తూనే ఉంటాడు.

నీటి మార్గమునకు అడ్డుపడిన రాతిని, నీటి ప్రవాహము ఏమి చేయును? ధమ్మని రాతిని పగులకొట్టి యవతలకు విసరి పారవేయునా? పారవేయదు. మెల్లమెల్లగా దానిచుట్టూ చేరి– అలలనే చేతులతో కౌగిలించి, లాలించి, బుజ్జగించి దానిని లోగొనునంత లెవెల్‌కు పెరిగి, దానిని తనలో నిముడ్చుకొని తనలో భాగముగ చేసికొనును.

ప్రకృతిచే ప్రేరేపింపబడు వికారములే మన ఆధివ్యాధులకు కారణములు. అవి ప్రకృతిచే చక్కబడునా? తాను ప్రేరేపించిన దానిని తానేల చక్కదిద్దును? దిద్దదు. కాన, దానినాశ్రయించి లాభము లేదు. ఈ మందుమాకుల వల్ల బాధ తొలగదు. ప్రేమమయమయిన ఆ ఈశ్వర తత్త్వమొకటే మన ఆధివ్యాధులను నివారించి మనలనుద్ధరించగలదు. అట్టి ప్రేమతత్త్వము యొక్క సహాయమున మనమానందమును పొందుటకు ఈ యోగము దారి చూపుచున్నది.



మాయవరమే మాయావరణం. ఏలాగో తంటాలుపడి యీ మాయవరాన్ని అంటే మాయావరణాన్ని దాటి ముందుకు సాగితే, సరిగా కుంభకోణములోనే దిగిపోతున్నాము. పోనీ– కుంభకోణం నుండి తప్పుకొని తిరిగి వస్తే– మళ్ళీ మాయవరంలోనే పడతాం, ఈలాగుంది మన స్థితి.

మాయావరణం కల్పించే పద్మవ్యూహంలో చిక్కుపడి బయటకు లేకుండా వున్నాము. కుంభకోణం వెడుతూంటే ఈ భావమే తోచింది. మాగాస్కూలు లో మాస్టరుగారు అలాగే అన్నారు. 'మాయవరం దాటి కుంభకోణం వస్తున్నామనీ, ఇదేదో మోసమనీ మీరు తలచేకాలం రావచ్చు.

ఈ మాయావరణమే మిమ్ములను అలా తలచేటట్టు చేస్తుంది. అప్పుడు మీరు నన్ను శంకించవచ్చు. కానీ, ఇట్టి ఒడిదుడుకులను దాటడానికి ఒక్కటే మార్గము. అది నామీద 'లౌ' అన్న నావతో ఈ చీకాకులనే సముద్రాన్ని మీరు దాటగలుగుతారు' అన్నారు.

''నీ వేమో తలపోయుచుంటి వదియే నీ కన్నులం దోచె భ్రాం
త్యా విష్ణుండవు గుర్తెరుంగ'' నను పల్కంగీకరింపం దగున్
నా వైక్లబ్యముచేత గల్గిన దటే నా తండ్రి! యానాడు ధ్యా
నావిర్భూతము దివ్యదర్శనము! మిథ్యార్థంబు లట్టుండునే?

ఆశ్చర్యంబుగ దోచె విద్యుతుల్ చెర్లాడెన్ విచిత్రంబుగా
నైశ్చల్య మ్మొదవెన్ ద్యుతిస్థలికి స్వర్ణచ్ఛాయముల్ దానన
త్యాశ్చర్యంబుగ నక్షరంబులును నయ్యై స్థానముల్ కన్పడెన్
పశ్చాద్దృష్టము లిందుకున్ సరిపడెన్; భ్రాంతత్వ మింకేదియో?

ఉ. చూచెద జూచెదన్ వెలికి; శూన్య మనంత మహాం
తరాళమే గోచరమౌను; దానికొక గొప్ప మహా
వరణమ్ము గ్రమ్ము; లో జూచెద జూచెదన్ బరమ
సూక్ష్మముగా బరమాణు బిందువే గోచర
మౌను దానికిని కొండక యావరమ్మె క్రమ్మెడున్;

శా. అజ్ఞానావరణంబు దీనినెటు పాయం ద్రోయగా
నేర్తునో జిజ్ఞాసైకరసంబుగా నెపుడు నా
చిత్తంబు వర్తించునో సుజ్ఞావర్త సుఖ స్వరూ
పుడగు నిన్ జూడంగ నెట్లబ్బునో ఓ జ్ఞానా
త్మక! ఓ సుఖాత్మక! విభూ! ఓ నిత్య సత్యాత్మకా! జిజ్ఞాసువు. 1920

# 11. ద్వేషము కూడదు.

కొన్నాళ్ళ క్రితం ఒక అమ్మాయి మా యింటికి ట్రీటుమెంటుకు వచ్చింది. వెంట వచ్చిన భర్తనడుగగా తన భార్యకు ఏదో దెయ్యం పట్టినదనియు, ఆమెకు ఒడలంతా పోట్లు, నొప్పులు కలుగుచున్నవనీ, నిద్రపోనివ్వక, తిండి తిననీయక నానా తిప్పలు పెడుతున్నదనీ– ఆ బాధల నివారణకు ఇటకు పొరుగూరి నుండి వచ్చాననీ తెలిపాడు. సరేనని అందరితో నమస్కారం చేసుకొమ్మన్నాను. అందువలన ఏమీ సర్దుకొనలేదు. మర్నాడు ఉదయం ఆ దంపతులు మరలా వచ్చారు. అందరితో కలసి నమస్కారం చేసుకొన్నారు. అయినా ఏమీ లాభించలేదు. ప్రేయరుకు వచ్చిన మిత్రులంతా వెళ్ళిన తరువాత ఆ దంపతులను పిలచి నా యెదుట కూర్చుండబెట్టుకొన్నాను.

ఆమెతో ''తల్లీ! నీకీ బాధ వచ్చినదెందులకో– అదియేలా తొలగిపోవునో తెలియాలనీ, బాధ తొలగిపోయి సుఖం కలగాలనీ– ఈశ్వరుణ్ణి ప్రార్థించు'' అన్నాను. వారిరువురు నమస్కారం చేసుకొన్నారు. కొంత సేపటికి కన్నులు తెరచి ఆమె ఇలా అన్నది–

'నా ఆడుబిడ్డ కొన్ని సంవత్సరాలకు పూర్వం చనిపోయింది. ఆమె రూపం ఇపుడు కన్నులు మూసికొనగా కనిపించింది. ఇదివరకు అపుడపుడు కనిపిస్తూంటుంది. దయ్యమయి నన్నిలా బాధిస్తూన్నదని నాకు తోస్తూంది.' అనింది.

నేను ''సరేనమ్మా! మరల నమస్కారం చేసుకొని ఈతూరి నీకు కనిపిస్తే, ఆమెకు నీనుండి యేమికావాలో తెలుసుకో. ఎంతో ప్రేమతో, ఆదరముతో నీవు కోరే కోరికలు తీర్చడానికి సిద్ధముగా ఉన్నాను. నన్ను బాధించకు అని కోరుకో'' అంటిని. ఆమె మరలా నమస్కారం చేసుకొన్నది. కనులు తెరచిన తర్వాత ఇలా అన్నది– 'ఆమె మరలా కనిపించింది. నన్ను వదలి పొమ్మని

కోరితిని. బాగా చెప్పుదెబ్బలు తినికాని పోనంటున్నది.' అనింది.

నేను 'ఏమి తల్లీ! ఆమె తనకు తానే చెప్పుదెబ్బలు కావాలంటుందా? ఎవరైనా తనను చెప్పుదెబ్బలు కొట్టమని కోరుతారా! కోరరు. మరి కోరేదెవరు? ఆ మనిషిపై ఈర్ష్యాసూయలు కలవాళ్ళే ఆ మనిషికి చెప్పుదెబ్బలు తగలాలని కోరుతారు. అందువలన ఈ చెప్పుదెబ్బలు కోరుతున్న దెవరు? నీవే. నీకు నీ యాడుబిడ్డపైనున్న ద్వేషము వల్ల ఆమెకు ఏదో శిక్ష జరగాలని లోపల యెక్కడో కోరుతున్నావు. ఆ కోరిక యొక్క పరిణామం ఇది. నీకామె పై ద్వేషమెందుకు తల్లీ' అన్నాను.

భర్త అడ్డువచ్చి-'నా భార్య చాలా బుద్ధిమంతురాలండీ! నాతోబుట్టువు, ఆమె చాలా స్నేహితురాళ్ళు' అన్నాడు. 'చాలు ఊరుకోవయ్యా నీకేం తెలుసు? పిల్లికి ఎలుక సాక్ష్యమా- సైకాలజీని ఎంతో జాగ్రత్తగా స్టడీ చేస్తే గానీ లోని నిజం తెలియదు. ఆ వ్యక్తిపై గల ద్వేషమే, ఆ దయ్యం నిన్నింతగా బాధించడానికి గల కారణం. అంతకన్నా వేరే కారణం లేదు. మన అసూయా ద్వేషాలే మనల్ని మరింతగా బాధిస్తాయి. ప్రేమ- ద్వేషము, ఇవి రెండూ బెల్లమూ, అల్లమూ. రెండవది దానికి క్వయిట్ ఆపోజిట్(పొద్దెదురు). ఈమెలోని ద్వేషమే రోగప్రాబల్యానికి కారణం. రోగం కుదిరితే ఆ దెయ్యం వదులుతుంది' అని ఆయనతో అని, ఆమెతో ''ఏం తల్లీ! ఇలా చూడు. ఇదిగో నీవు నీ యాడుబిడ్డను నీ తోబుట్టువు లాగు కాదు; నీ కన్నబిడ్డ లాగు ప్రేమించాలి. ఇదివరకుండే పాత ద్వేషాలను, రోషాలను కడిగి వేసుకోవాలి. అంతే. 'క్లోజ్' ఇదుగో ఇప్పుడు చూడు నీ మనస్సును చల్లగా, తియ్యగా కుదుర్చుకొని ఆమె, నీవూ సుఖంగా వుండాలని కోరుకో'' అన్నాను. ఆమె కొంచెం తటపటాయించింది. 'ఊ...ఏమిటా వేషం?' అని గదమాయించాను. ఆమె సర్దుకొని మనసు మార్చుకొని కొంచెం చిరునవ్వుతో నమస్కారం చేసుకోవడం నాకూ గోచరించింది. కొంచెం సేపటికి

కళ్ళు తెరచింది. చాలా ఉత్సాహంగానూ, సంతోషంగానూ ఉంది. నాకు నమస్కారం చేసి 'బాబుగారూ! మీరు రక్షించారు. మనసులోని పీడ అంతా తొలగి పోయింది. దాంతో శరీరంలో బాధలన్నీ పోయాయి. చాలా సుఖంగా ఉంది. ఇకమేము వెళ్ళివస్తాం బాబూ! నమస్కారం' అంటూ బయలు దేరారు. 'మంచిది మీ దంపతులు సుఖంగా ఉండండి. ఈ ముసలాణ్ణి మాత్రం అప్పుడప్పుడు జ్ఞాపకం చేసుకోండి' అన్నాను. వాళ్ళు చిరునవ్వుతో 'అయ్యో ఎంత మాట' అంటూ వెళ్ళారు.

ఆమె ఆరోగ్య మాపూటతో చక్కబడ్డది. ఇపుడామె సుఖంగా వుంది.

విశ్వామిత్రుడు, దుర్వాసుడు, ఋష్యశృంగుడు వీరి ముప్వురి యోగ్యత లెట్లాంటివి? మొదటి ఇద్దరూ రాజస, తామసాల యొక్క ప్రతిరూపాలు. వాళ్ళవల్ల వాళ్ళకే ఉపయోగం లేదు. ఇక లోకానికి ఏం ఉపయోగిస్తారు? పోతే ఋష్యశృంగుడు. అతడి సంకల్పాలన్నీ పరమ పవిత్రాలే! అతని యాక్టివిటీ యావత్తూ ఏదో మంచిని సాధించేందుకు, సృష్టి క్రమాన్ని కొనసాగించేందుకు, లోకాన్నుద్ధరించేందుకు ఉపయోగపడింది. పై ఇరువురి మాదిరిగా– ఉన్నదాన్ని చెరిచేందుకు కాదు. అటువంటి ఋష్యశృంగుడు మొదలైనవారే మనకు మార్గదర్శకులు.



ఏదో చిన్నచిన్న రోగాలను, బాధలను పోగొట్టడానికి ఈలైను ఏర్పడ లేదు. ఎటర్నటీని అనగా అమరత్వాన్ని స్థాపించడానికై ఏర్పడింది. ఈ ఎటర్నటీ అనేది ఫిజికల్‌ఫీల్డు(భౌతిక దేహం) లో వర్కుచేయడం మొదలు పెడితే "సుఖేన బ్రహ్మ సంస్పర్శం అత్యంతం సుఖమాప్నుతే'' అన్నట్లుగా ఉంటుంది. ఆ బ్రహ్మసంస్పర్శ ఏలాగుంటుంది? సమాజాన్ని వదలి పెట్టి ఏ ఒక్కడూ అట్టిస్థితిని పొందలేడు. ఈ విశ్వంలో ఏ ఒకడు అట్టి యోగ్యత

ను సంపాదించినా వాడే ఈలోకంలోని ప్రజానీకాన్ని అంతా ఆ లెవల్కు తీసుకు రా గలుగుతాడు. అదే ఈ త్రిదశావస్థ. జాతి, మత, కుల, ధన విభాగాలన్నీ విడనాడి ఈశ్వరత్త్వమును వెన్నాడి అనుసరిస్తేనే కాని మనకా లెవెల్ అందదు.

# 12. అమరత్వము

ఆధులచే, వ్యాధులచే బాధలు పడుచున్న నన్ను బాగు పఱచి స
ర్వాధారమైన నీతే, జోధారకుఁ బాత్ర మొనరుచు కొనవే! దేవా!

అని యెప్పుడో వ్రాసిన పద్యం గుర్తుకొస్తూంది. మనకు ఈ అలజడి, కాకులు అన్నీ మనలో నుండే వస్తున్నాయి. ఎపుడెపుడో మన మొనర్చిన పనుల సారాంశమంతా మనల నంటి పెట్టుకొని యాడించు చున్నది. లా పేరుకొన్న మురికి నంతనూ 'మాస్టరు సి.వి.వి.' సహాయం వల్ల మప్రవాహంలో కడిగి వేసుకోవాలి.

ఉస్తికాయ ఉన్నదున్నట్టుగా మనం తినగలమా? దానిలో మనకు రిపడని, యోగ్యముకాని పదార్థములెన్నో ఉన్నాయి. ఆ ఉస్తికాయ పెన్‌చేసి, దానిలోని పనికిరాని గిజరు తీసివేసి, కడిగి శుభ్రపరిస్తే అది నదగినదై యుంటుంది.

అటులనే మనలోని యశుచిని పారద్రోలి నిత్య శుచిత్వాన్ని నెలకొల్ప నచో మనకు అమరత్వం సిద్ధించగలదు. అమరత్వమనగా యేమిటి? న బ్రతుకంతా ఎన్నో విషయాలపై ఆధారపడి ఉన్నది. అలా వుండ కుండా నం యిండిపెండెంటుగా 'స్టాండు' కావడమే అమరత్వం. ఆహారం కుండా కొంతసేపు మాత్రం ఉండగల్గుతున్నాము. మనము మరత్వమునకు దగ్గరయగు కొలది క్రమముగా ఆహారము మానిననూ వ గలగాలి. నీరు త్రాగకయే జీవించ గలగాలి. చిట్ట చివరకు గాలి కయే ఈ ప్రజ్ఞతో కంటిన్యూ కావాలి. అట్టి యోగ్యత సృష్టిలో ఇంత వరూ పొందలేదు. ఇకముందు పొందగలమా అంటే ఈ యోగమార్గము నసే పొందాలి. సరోజినీదేవి ఉపన్యాసంలో– 'మరణ రాహిత్యము' అని

చెప్పింది. ఆమె చెప్పిన మాటలు సత్యం. ఒక బోడి సన్యాసిని నీవేమి చేయగలవు అని అడగవచ్చును. కానీ ఈ యోగ మార్గమున అమరత్వం సాధించడం సత్యం. నేను పొందవచ్చును, పొందలేక పోవచ్చును. కానీ ఏదో ఒక సోల్ పరమ ప్రాప్యమైన అమరత్వం పొంది తీరుతుంది. వెనుకటి జన్మంలో ఎట్లా ఉన్నానో కాని, ఈజన్మలో ఇదే నిశ్చయంతో వున్నాను. అందులో ఏలోటు జరిగినా, నా దౌర్బల్యమే కాని, వేరు కాదు. నేను లోకానికి ఉపరించకపోతే అట్టి యోగ్యత నాలో లేదని విచారిస్తాను. అంతేకాని ఈ యోగాన్ని నిందించను. గట్టిగా ఉండే మంచిచెట్టుకు ప్రమాదం ఉండదు, తొల్ల ఉంటే మహావృక్షం సహితం కూలుతుంది''.

శ్రీ నిరంతరానందనిశ్రేయ సార్థ
సాధకము, సర్వ కిల్బిష బాధకము, స
మగ్ర విజ్ఞానదము, మహా మహిమ ఘనము
శరణమగు మాకు సద్గురు చరణయుగము.

# 13. శుచిత్వము–స్పృశ్యత

"మనదేశంలో ఇన్ని మతాలూ, జాతులూ వాటి భేదాలూ పడుగు పేకల్లాగమనల్ని చుట్టివేసినాయి. అదీగాక, మతద్వేషమూ– జాతి ద్వేషమూ యీ రెండూ తేనెతుట్టెల్లాగా కూడా మనల్ని ఆవరించాయి. దానితో నేను వేరు, నీవు వేరు అనే భేదభావం ప్రతీవ్యక్తిలో పుష్కలంగా ప్రభవించింది. దీనివల్లనే అంటే యీ పృథగ్భావం వల్లనే ప్రతీప్రాణికీ ప్రమాదం సంభవిస్తూంది. ప్రమాదం అంటే మృత్యువే. దాన్ని మనం ఎలా జయించగలం? అది అంత సులభమా? కాదు. ప్రయత్నం చేసి జయించాలి. అంటే మనలో ఉండే జాతిమత విద్వేషాలు రూపు లేకుండా మాపుకోవాలి. అంతా ఒకటేనన్న భావం కలగాలి.

హిందూమతం ఇపుడున్న స్థితిలో నుండుటకు అట్టిభావం లేకుండా ఉండడం వల్లనే కదా! ఇందులో ఎన్నో శాఖలు, కులాలు. ఒకరికి ఇంకొకరికి పొంతనలేదు. పైగా తీవ్రమయిన స్పర్ధలకూ, విద్వేషాలకూ నిలయమై పోయింది. హిందూమతానికి మూల స్థంభాలుగా నుండ వలసిన మఠాలు, మఠాధిపతులూ, పీఠాధిపతులూ, దేవాలయాలూ ఈశ్వరుని యొక్క దివ్య తేజమును పంచి పెట్టేవి పూర్వం. అట్టివిపుడు అందరకూ సమానంగా పంచి పెట్టేవిగా ఉన్నాయా? జ్ఞానాన్నీ, ఆనందాన్నీ వెదజల్లు తూన్నవిగా ఉన్నయా? లేవు. అవి అజ్ఞానానికీ, మూఢత్వానికీ చిహ్నాలు మాత్రంగానే ఉన్నాయి. ఎప్పుడో ఎవరో వ్రాసిన మంత్రాలను పట్టుకొని వ్రేలాడడం, వారు చెప్పిన పూర్వాచారాలను గుడ్డిగా అనుసరించడమేనా హిందూమతము? లోకాన్నంతా ప్రేమించి, తాను లోన, బయట శుచిగా ప్రవర్తింపవలయునే కాని, పైపై డాంబికాల వలన యేమవుతుంది? మన ప్రక్కవారు దాహంతో పీక్కు చస్తున్నా 'వెధవా పో! నీవు మాలవాడివి. నిన్ను అంటకూడదు. నీకు

మంచినీళ్ళు ఇవ్వం పో' అన్న స్థితిలో మనం ఉన్నాం. 'పంచములు మాత్రం మానవులు కారా? వారినల్లా నీచంగా చూడడం మానవత్వమేనా? 'తగదు. వారిని చక్కబఱచి మనతో సమానంగా గౌరవించడం న్యాయం' అని ఎవడైనా ఒకడంటే, వాడి తలకాయ బద్దలు చేస్తున్నాం. ఆ కార్యానికి సంతోష సూచకంగా మిఠాయిలు పంచిపెడుతున్నాం. ఇంతకంటే సిగ్గుపడవలసిన విషయం, దుఃఖపడదగ్గ విషయం ఏముంటుంది?

అసలీ పంచములు ఇలాగెందుకున్నారు? దీనికెవరు బాధ్యులు. అదిగో ఆ బజారులోనున్న పిల్లవానిని చూడండి. కాళ్లనిండా బురద, చినిగిన చొక్కా నిండా మట్టి, మసి, తారు మరకలు, జుట్టునిండా యిసుక వాటితో అలా ఉన్నాడు. అటువంటి కుఱ్ఱవానిని యెవరు ఎత్తుకొని ముద్దాడ గలరు? అది నిజమే కానీ, దానికి బాధ్యులెవరు? ఆ కుఱ్ఱవానిని ఉదయం లేపి, స్నానం చేయించి, మంచిబట్టలు కట్టించి, బడికి పంపి, శుచిగా వుంచే బాధ్యత యెవరిది? అది పెద్దలపైనే ఉంది. మురికిగా నున్నాడని పిల్లవానినంటే లాభమేమిటి? అట్లనే

పంచములు శుచిగా ఉండడం లేదనీ, మనమధ్య ఉండటానికి వారికి యోగ్యత లేదనీ, యీసడించడంలో సారస్యమేమిటి? పంచములాస్థితిలో నుండుటకు అగ్రవర్ణములనుకొను మనమే కదా బాధ్యులం. వారికి విద్య నేర్పక, సదాచారముల నలవరచక, క్రిందికి త్రోసివేసి వారు మనతో సమానంగా ఉండటం లేదంటున్నాము! వారిని చక్కదిద్ద వలసిన బాధ్యత సంఘములోని పెద్దలపైనే ఉన్నది.

శరీరంలో ఒకభాగం రోగగ్రస్థమయితే తక్కిన అవయవాలు పనిచేయ జాలవు గదా? పైపెచ్చు శరీరానికంతకూ చెరుపే కలుగుతుంది. అలానే యీ సంఘమనే శరీరంలోని యీ రోగాన్ని మనమంతా కలిసి పోగొట్టి బాగుపరచాలి.

శరీరాన్నీ, మనం ఉపయోగించే వస్తువులనూ మలినము లేకుండా ఉంచడమేనా శుచి? అదీ ఒకవిధంగా ఉండడం అవసరమే.

బాహ్యాభ్యంతరశ్శుచిః... అనేది మనం గమనించాలి. మన ఆలోచనలు ప్రవర్తనలు మాటలు శుచిగా ఉండాలి. మన ఆలోచనలు ఒక తీరుగానూ, మాటలు ఇంకొక తీరుగానూ, చేతలు మరో తీరుగానూ ఉంటే మనలో శుచిత్వమెక్కడ ఉన్నట్లు?

శ్రీకృష్ణుడు సంధికై హస్తినాపురం వెళ్ళినాడు. రాజరాజగు దుర్యోధనుడు, ఇంకెందరో రాజులు, విదురాదులగు మంత్రులు ఆయనకు స్వాగతమిచ్చారు. దుర్యోధనుడు మొదలగువారు తమ, తమ గృహాలకు విందుకు రమ్మని ఆహ్వానించారు. కాని, కృష్ణుడు అచ్చటకు వెళ్లలేదు. అతని యాశ్రితుడగు ఒక సామాన్య గృహస్తు విదురుడు. అట్టి విదురుని యింట శ్రీకృష్ణుడు బసచేసినాడు. ఎందువలన? రాజరాజు ఇంటిలో భోజనము లేదా? చేదే. అతని ఆలోచనలు చేతలు తిన్నవైనవి కావు. అందువలన కృష్ణుడక్కడికి వెళ్ళలేదు. విదురుడు నిండారిన ప్రేమతో కల్లా కపటమెరుగని భక్తితో తనను ఆహ్వానించినందు వల్లనే అక్కడకు వెళ్ళినాడు.



మనం ఒకచోట నుండి అన్నివైపుల పరికించి చూస్తే ఆకాశం క్రిందకు దిగి మనచుట్టూ ఉన్న భూమితో అంటిసలాడడం కనపడుతుంది. దానినే హొరైజన్ అంటారు. ఈ హొరైజన్ యెక్కడకు వెళ్ళి చూసినా మనచుట్టూ కనబడుతూనే ఉంటుంది. అది మన కంటిచూపున కందినంత దూరంలోనే ఉంటుంది. కాని, మనదగ్గరకు రాదు. మనం ఎంతదూరం ప్రయాణం చేస్తున్నా అది మనకెడం గానే ఉంటుంది.

మన కష్టాలు, వ్యాధులు, చివరకు మృత్యువు యెటు చూచినా మన చుట్టూ

కనబడతాయి. మనలోని దౌర్బల్యం వల్ల మన దగ్గరకొస్తాయి. మన మీదికీ వస్తాయి. ఈ యోగమహత్తు వల్ల యీ కష్టాలను, వ్యాధులను మృత్యువును మనకెడంగా ఉంచగలుగుతాము. మనం యెటు నడచినా యీ వ్యాధులూ, కష్టాలూ, మృత్యువూ హొరైజన్ మాదిరిగా దూరదూరం గా తొలగిపోవాలి, అంతేగాని మన దగ్గరకు రాకూడదు. అలా మృత్యువును తక్కిన వాటిని మన సమీపానికి రాకుండా నిగ్రహించి హొరైజన్ మాదిరిగా సదా ఎడంగా ఉంచగలిగిననాడే అసలు మృత్యువును జయించడం సాధ్యమవుతుంది, అనగా ఎటర్నటీ ఎస్టాబ్లిష్ అవుతుంది.

# 14. మంచితనము

ఇతరుల నవమానించెడు
మతిమాన్పుమి; పరుల చెడ్డమాటల పైపన్
ధృతిగూర్పుమి, సంతోషా
మృతరసమిడి సేద దేర్పుమీ, నాస్వామీ!

అందక పొందక విడివడి
చిందులు ద్రొక్కెడి మనస్సుం జేకొని సరిగా
నందముగా నడవంగల
చందమునన్ దిద్దుకొనవె సద్గురుమూర్తీ!

మనస్సు అంటే ఏమిటి? పాదరసము వంటిది. నేను చాలాసార్లు హెచ్చి[illegible]గానూ, కొన్నిసార్లు చల్లగానూ మాట్లాడుతూ వుంటాను. అనేకసార్లు ఇతరులను కోపగించి మాట్లాడుతానే కానీ, ఇతరులను నొప్పించాలనే భావం ఎప్పుడూ ఉండదు. మాత్సర్యంతో ఇతరులను పరాభవించాలని నాకు ఎప్పుడూ తోచదు. ఎదిరికి అపకారము కలుగవలెన నుకొనుట లోనే మనకు [illegible]ము, అపకారము ఇమిడి ఉంది. ఆ ఫలము వెంటనే కానీ, కొంతకాలానికి [illegible] అనుభవానికి వస్తుంది. తప్పదు.

"సర్వత్ర సంపదస్సంతు సర్వేసంతు నిరామయాః" అనే భావంలో [illegible]సం లీనమైపోతే దాని వల్ల లభించే అభ్యున్నతికి అంతు వుండదు. మాష్టరు [illegible]దయినా యిచ్చినారంటే, నా వలన మీకూ, యితరులకూ ఏదయినా [illegible]కృతి జరుగుతున్నదంటేను అదంతా మంచితనం వల్లనే. మంచితనము [illegible] వేరేమీలేదు. నాలో ఎన్నో దౌర్బల్యాలున్నా గ్లాసును కడిగివేసినట్లుగా [illegible]సం చేయాలని కోరుకొంటాను. నేను కారణంగా ఈలైనుకు నింద

రాకూడదు. నేను కారణంగా ఈ లైను కు నింద వస్తే ఆత్మత్యాగం చేస్తాను. రామాయణంలో ప్రతిపాదించిన స్వచ్ఛమైన శీలమే నాలో జీర్ణమై ఉన్నది. అపకారంలేని ఉపకారభావమే మేలయినది. ఋజువర్తనుని ఎవరూ యేమీ చేయజాలరు. ఋజువర్తనుడు కాని వానిని ఎవరూ యేమీ చేయనక్కర లేకుండగనే తన్నుతాను చెరుచుకొంటాడు. అతనియపకార చింతయే అతని నెత్తిపై కొడుతుంది. యుద్ధముచేసి రావణాసురుని చంపుట పూర్వకాలంలో అవసరమయింది. కాని యిక భవిష్యత్తులో అలాంటి యవసరమే వుండకూడదు. మచ్చలులేని దివ్యతేజో రాశిగా ఉండాలి. అట్టిమంచితనమునకై మనం ఈశ్వరుణ్ణి ప్రార్థిద్దాము.

తలపులు విశుద్ధములుగాఁ
దలఁపింపుము పలుకు లమృతధార లనంగా
బలికింపుము కార్యంబులు
సలిపింపుము పరహిత ప్రశస్తంబులుగాన్.

★★★

ప్రాణాన్ని ప్రాణంతోనే కొలవాలిగానీ, ప్రాణాన్ని డబ్బుతో కొలవరాదు.

# 15. శ్రద్ధా భక్తులు

మానవుని యొక్క ఆకారం, నడక చూస్తే అతని ప్రవర్తన యేలాటిదో తెలిసిపోతుంది. వాడు సరసుడో, విరసుడో, యోగ్యుడో, అయోగ్యుడో మంచి ప్రజ్ఞావంతుడో, అప్రయోజకుడో స్థూలంగా అతని ముఖం చూస్తే తెలుస్తుంది.

అలాగే ఒక సంసారం యొక్క మంచి – చెడ్డలు వారు నివసిస్తూన్న గృహం చూస్తేనే తెలుస్తుంది. ఆ యింటిని వారు శుభ్రంగా, శుచిగా సరియయిన స్థితిలో నుంచడంలోనూ, ఉపయోగించే వస్తాలను దాచే తీరులోను ఆ గృహస్థుల యొక్క ఆలోచనలు, సాలోచనలు, అలవాట్లు మనకు గోచరిస్తాయి. ఈ విషయాలను సూక్ష్మాతిసూక్ష్మంగా గమనించే యెడల ఎన్నోవింతలు విశదం అవుతాయి.

ఈవాళ ఉదయం ఒకరు నా వద్దకు వచ్చారు. అతను రావడం గమనిస్తేనే నాకు ఒక వింతభావం తోచింది. అతనెంతమాత్రం సరసుడు కాడనీ, మూర్ఖుడనీ తోచింది. రాగానే అతను 'మా ఆవిడ అనారోగ్యంగా ఉంది. తప్పక మీరు వచ్చి ట్రీటుచేసి వెళ్ళండి. మా ఆవిడ కూడా ఈ విషయం మీకు చెప్పమనింది. నాకు పొరుగూరికి వెళ్ళవలసిన తొందరపని ఉంది' అన్నాడు.

''ఆమెకేం జబ్బు నాయనా!'' అన్నాను.

'అదేమో నాకు తెలియదండీ. నాలుగు రోజుల నుండీ లేవలేక మంచం మీద పండుకొనుంది. ఏదో మీరు వెళ్ళి కాస్త ట్రీటుమెంటు చేసి రాండి' అని లేచి 'వస్తానండి', అంటూ నమస్కరించి వెళ్ళిపోయాడు.

ఆ మనిషి యేలాటివాడో నేనింకా వివరించాలా? భార్యకు ఏం జబ్బు చేసిందో కనుక్కోలేని బుద్ధిమంతుడు. అయిదు రోజులుగా భార్య

బాధపడుతున్నా ఆయనకు పట్టలేదు. డాక్టరుని పిలువ వలసి వచ్చేటప్పటికి కొంచెం బుర్ర పనిచేయాల్సి వచ్చింది. డాక్టరుబిల్లు తప్పించు కొనేందుకు, ఇంట్లో బాధపడే వారి పోరు నివారించు కొనేందుకు దారి యేమిటిరా అని ఆలోచించాడు. సరే! ఆ శాస్త్రుల్లతో ఒకమాట అనిపోదాం అనుకొన్నాడు కాబోలు. చూశారా లోకంలో ఇలాంటి వింతవింత సంఘటనలు ఎన్నో జరుగుతుంటాయి. భార్యకు కాస్త శరీరంలో ఏదయినా బాగులేకపోతే తనకు కాదన్నట్టుగా మిన్నకుండా ఊరుకొంటాడు భర్త. ఆయన గారికి కాస్త వెచ్చ తగిలిందంటే పిల్లలను కూడా చూడడం మానేసి సర్వోపచారాలూ చేయాలి భార్య. వీళ్ళిద్దరికీ పొత్తు ఎలా కుదురుతుంది? అతని మీద మహ చెడ్డ కోపం వచ్చింది. కానీ బాధపడుతున్న ఆమె మీద నాకు చాలా జాలివేసింది. ఆమెకు ఆరోగ్యం కలగాలనీ, వారిద్దరిలో పొత్తు కుదరాలనీ అనుకుంటూ వారింటికి వేంవు వెళ్ళావు. వాకిలి వుుందంతా చెత్తాచెదారవు. తుడిచి యెన్నాళ్ళయిందో? ఇల్లంతా శిథిలావస్థలో ఉంది. లోనికి వెళ్ళగానే మరీ అసహ్యం కలిగింది. రోగి మంచం మీద పరున్నది. మంచం చుట్టూ ఉమ్మి మరకలు. ప్రక్కన మగవారివి, ఆడవారివి మాసిన గుడ్డలు, వాటిని త్రొక్కు కుంటూ నడుస్తున్నట్లున్నారు. ఇంటికి కిటికీలు లేవు. పగలే చీకటిగా ఉంది. పైగా జ్వరపు కంపు వేస్తూంది. మంచిగాలి రానూ పోనూ వీలులేని యిల్లు. రోగిని చూశా, పాపం చాలాబాధలో వుంది. న్యుమోనియా. పల్చటి బట్టలు ధరించింది.

'ఏం తల్లీ! ఇలా ఉన్నావు. న్యుమోనియాకు తగ్గ జాగ్రత్తలు తీసుకోవాలి. చలిగాలి తగలకుండా ఉన్నితో చెస్టును కప్పుకోవాలి. బాగా వెచ్చని పాలు వగైరాలు తీసుకోవాలి'' అన్నాను. ఆమె జాలిగా నవ్వుతూ 'ఇంట్లో ఏమీ లేవు బాబూ! బీదవాళ్ళం' అంది.

నిజమే చాలా దుఃఖమొచ్చింది. మనదేశ దౌర్భాగ్యం అంతా నిప్పచ్చరి

మనకన్నిటికీ కరువే. ఉండేందుకు ఆరోగ్యకరమైన ఇళ్ళు, వెచ్చని వస్త్రాలు, మంచి భోజనం అందరకూ లభించాలి. అందుకు ప్రభుత్వం త్వరత్వరగా పూనుకోవాలి. లేనివిపుడు నిమిషంలో రావు కదా! ఉన్న వాటినన్నా మనం సరిగా ఉపయోగిస్తున్నామా? ఇంట్లో వున్న పనిముట్లు శుభ్రంగా ఉంచుకొనేందుకు పెట్టుబడియేమీ అక్కరలేదు. క్లీనుగా ఉండాలనే జ్ఞానం ఉంటే చాలు. ఆమెతో 'మీఇల్లు ఇలా రోత పుట్టిస్తున్నది కదా తల్లీ! ఇలా ఉంటే జబ్బులు రాకేం చేస్తాయి? అసలు మీ యజమాని గారేం చేస్తారు? మీ తల్లిగారున్నారు కదా! వారేం చేస్తారు? ఈ జ్వరం రాక పూర్వం మీరేం చేస్తున్నారు?' అన్నాను.

ఆమె ఏమీ మాట్లాడలేదు. నాకు ఉండటానికి మనస్కరించ లేదు. బయటకు వచ్చాను. బయటకు వచ్చినప్పటి నుంచి నా మనస్సు వెనుకకు లాగ మొదలుపెట్టింది. అయ్యోపాపం! ఆమెను అలా వదలి రావడమేనా? అనిపించింది. ఆ భావంతో ఇల్లు చేరుకొని నమస్కారం చేసికొన్నాను. ఏదో ఆమెకు రిలీఫ్ కలిగినట్లుంది. నా మనస్సు కొంత శాంతపడ్డది. ఒక గంట ఆగి మన సచ్చిదానందం వెళ్ళి, చూచివచ్చి ఆమె కులాసాగా ఉందనీ, లేచి కూర్చున్నదనీ, భక్తితో నమస్కరించిందనీ చెప్పాడు. మనస్సుకు చాలా భారం తగ్గింది. రిలీఫ్ కలిగింది.

సాయంత్రం ఆమె యజమాని, చంద్రగిరి నుండి మా యింటికి వేం చేసినాడు. 'ఏం నాయనా! మీ భార్యకెలావుంది?' అన్నాను.

''అబ్బే! నాకసలేం తెలియదండీ. మీరు వెళ్ళి వచ్చారేమో మీకేమయినా తెలిసి ఉంటుందేమోనని వచ్చా. వ్యవహారం మీద చంద్రగిరి నుండి సరాసరి ఇక్కడికే వస్తున్నా'' అన్నాడు.

నాకు చెడ్డ చిరాకేసింది.

''నిన్ను అంటే యేం ప్రయోజనం? ఇట్టి వానికి ఈ సంసారాన్ని

అంటగట్టిన వారిననాలి. మీయింటికి వెళ్ళివచ్చా. నీ ప్రవర్తన యేలావుంది నీ ఇల్లూ అలాగే ఉంది. నీభార్య ప్రాణం కన్నా మించిన వ్యవహారమేమి నీకు? నీవిలా అడ్డదిడ్డాలుగా ప్రవర్తించి పెంటల మీద తిరిగి వచ్చి ఆవిడ ఆరోగ్యాన్ని ధ్వంసం చేస్తున్నావు. అందుకు కించిత్తయినా విచారము లేదే నీకు? ఇప్పుడైనా బుద్ధి తెచ్చుకొని ముందు నీభార్యనూ, నీయింటినీ, నీ సంసారాన్నీ చక్కదిద్దుకో. అలా చూస్తావేం? కోపమొచ్చిందా? లాగి చెంప మీద ఒకటి పేద్దామనుకొంటున్నావా? అవును వేయాల్సిందే. ఎవరిని? నీలోని ధాష్ట్యాన్నీ, మూర్ఖత్వాన్నీ'' అని గదమాయించేటప్పటికి ఆయన తలవంచాడు. తిన్నగా ప్రవర్తిస్తానని ఇంటికి వెళ్ళి సాయంకాలం మరలా వచ్చి తన భార్యవిషయం చెబుతానని వెళ్ళాడు.

ప్రార్థనకు ముందుగా వచ్చాడు. చాలా ప్రశాంతంగా వున్నాడు. స్నానం చేసి మంచి బట్టలు వేసుకొన్నాడు. తన భార్య ఆరోగ్యం చక్కబడ్డదన్నాడు. ఇల్లంతా కడిగి తుడిచి బాగుచేశాననీ, గుడ్డలన్నీ తానే శుభ్రపరిచాననీ, భార్యకు మంచి దుస్తులు, మంచిపక్క అమర్చాననీ, సరిపడ్డ భోజనం ఇచ్చి వచ్చానని అన్నాడు. నేను పరమానందంతో ఆయన వీపుతట్టి పంపా.

ఇందులో మనం గ్రహించవలసిన సారాంశమేమిటి? ఒక్క అసందర్భాన్ని గుర్తించి ఉదాసీనంతో ఊరుకుంటే అది యెన్నో అసందర్భాలకు దారి తీస్తుంది. ఒక విషబీజం నుండి వచ్చే విషవృక్షం కొమ్మలు, రెమ్మలు, ఆకులు, పూలు, పండ్లు అన్నీ విషమయమే అవుతాయి. ఈ రిజల్టంతా ఆ విషబీజానిదేనని గుర్తించుము. జీవిత సుఖమంతా భార్యాభర్తల అనురాగం పైన 'బ్యాలెన్సు' అయి వుంటుంది. అక్కడ ఏదో వంకర యేర్పడితే అంతా వంకర అవుతుంది. తరువాత వచ్చే అసందర్భాలన్నిటికీ అదే మూలం. సంసారం నిస్సారమే అవుతుంది. ఇల్లు ఆకారం మారిపోతుంది.

ఈ కల్లోలం యొక్క రియాక్షన్ వాళ్ళ సంతానం మీద ప్రతిఫలిస్తుంది. బిడ్డలపై తల్లిదండ్రులు తీసుకోవలసిన శ్రద్ధాసక్తులు తీసుకోరు. క్రమశిక్షణ ఉండదు. పిల్లలు అల్లరి చిల్లరగా తిరగటానికి అలవాటు పడతారు. అందువల్ల బిడ్డల ప్రవర్తన అడ్డదిడ్డమవుతుంది. భార్యాభర్తలు ఫలానాయని చెప్పుటకు వివరింపరాని బాధలకు, వ్యాధులకు గురియవుతారు. ఇవి అన్నీ ఎందుండి వచ్చాయో గమనింపరు. అసలు రోగం ఎక్కడుందో కానక ఏదో చికిత్స చేస్తారు. అది పొసగుతుందా!''

పరుషము నిష్ప్రయోజన మబద్ధ మనార్యము చేరరాదు నా
విరచనలందు, డెందము పవిత్రముగా విలసిల్లి సత్యసుం
దరము పరార్థయుక్తమగు తత్త్వమునే వెలయింపగా వలెన్
గురుచరణారవిందములకుం బ్రణమిల్లెద నట్టి నేర్మికై.

# 16. ఈశ్వర కరుణామృతము

చక్షుర్గోచరమైన ఈ జగతికిం జాల్లై యనేకాద్భుత
ప్రేక్షాలక్షిత మెంతయేన్ గలదు, తద్విజ్ఞాన సర్వస్వమున్
లక్షింపం దగు శక్తి మర్త్యులకు గల్గన్ లేదు; యద్దాన; ప్ర
త్యంక్షంబైనది నీ కొకింత; యట మాటై యింక నేమున్నదో

పంప్రెండ్లేడిటు పంటి సంశయములే బాధింపగా నెన్నియే
న్మంత్రాటంబులు గాంచితిన్ దొరకె నమ్మందగ్గ సన్మార్గ మో
తంత్రుల్, సర్వము నీశ్వరేచ్ఛ నడపున్ దత్కృత్యముల్ గూఢముల్
కంత్రుంగానరు మానవుల్ తమ కహంకారంబు పైకొంటచేన్.

ఎఱుగ న్నేరర కాని యీశ్వరుడు తా నేమేమి కావించు న
త్తెఱఁగెల్లన్; మునుమున్న సూచనలచే దెల్పించు; విజ్ఞాత్మకుల్
గుఱుతింపందగు నట్లె ఉంగుదును; గైకోవన్న! నాయన్న! యీ
చిఱుదిండ్లన్ నెలనాళ్ళదాక; నటపై జేకూరు నీ కామ్యముల్.

తీవ్ర అనారోగ్యంతో బెక్కు మాసములుగా శయ్యపై, అంపశయ్యపై భీష్ముని వలె- శయనించి యున్నప్పుడు ఒకానొకనాడు దేశోద్ధారక శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు భగవత్ప్రార్థనానంతరము అనుభవించిన సుఖానుభూతి వృత్తాంతము.

నాడు శుక్రవారము. ఉదయము ఎనిమిది గంటల వేళ శ్రీ నాగేశ్వర రావుగారి సన్నిధికేగితిని. దేశోద్ధారకుడు తీవ్ర అనారోగ్యంతో బెక్కు మాసముల నుండి శయ్యపై, నంపశయ్యపై భీష్మునివలె శయనించి యున్న కాలమది. వారియారోగ్య ప్రాప్తికై భగవత్ప్రార్థనము జరుపుటకు ప్రాతః స్సాయం సమయములందు వారికడ కేగుచుండిన నాళ్ళవి. నాడు

నాకాఫీసుకు బోవలసిన తొందర లేదు; గాన భగవత్ప్రార్థనానంతరము భగవదనుగ్రహమును గూర్చి శ్రీ నాగేశ్వరరావుగారితో నేదో కొంతముచ్చట జరిపితిని.

దాని సారము:--

అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్.

అని

అనన్యసాధ్యే స్వాభీష్టే మహా విశ్వాస పూర్వకమ్,
త దేకో పాయతా యాచ్ఞా ప్రపత్తి శ్శరణాగతిః

పై సుప్రసిద్ధములయియున్న శ్లోకముల తాత్పర్యమే. ప్రతిపూట, ప్రార్థనానంతరము వారికి కలుగుచున్న శరీర సుఖము వారు నాకు చెప్పుచుండువారు. నాడట్టి సుఖానుభూతి యధికతరముగా నుండుటను బట్టి కొంత యధికముగా పై గోష్ఠి జరిగెను. అందు 'అనన్య సాధ్యే', 'మహా విశ్వాస పూర్వకమ్', 'తదేకోపాయతా యాచ్ఞా' పదముల ప్రాధాన్యమును, అర్థమును లోతుగా ముచ్చటింప నేర్పడెను. శ్రీ పంతులు గారాముచ్చటలో దమ ధన, ధాన్య, బంధు, విద్య ప్రాభవాది వైయర్థ్యమును పరామర్శించుచు అర్జునకు నిజముగా పెన్నిధి, ఆప్తబంధువు, వైద్యుడు, భగవంతుడే యన్న విశ్వాసమెంత నియతితో నారాధించిన మీద నెంత యనుభూతి మీద నేర్పడదగినది అనుచు నాలోచ నాంబుధి లో మునిగి కొంత సేపటికి గనులు మూసుకొని పారవశ్యమును బొందిరి. మరి కొంతసేపు నేనక్కడ నుండి యంతలో మెలకువ రానట్టుండుట గుర్తించి ఇంటికి వెడలితిని. ప్రార్థన సమయమున గూడ వారు ప్రగాఢ నిద్రావశులగుటయు నేను కొంతసేపటిదాక మెలకువను బ్రతీక్షించుచు జెంత నుండి, వారు నిద్రలోనే యుండుటచే నేనింటికి వెళ్ళుటయు దఱచుగా జరుగు చుండెడిదే. ఆనాడు

నేనింటికి వెళ్ళుట కించుమించుగా పదిగంటల వేళ కావచ్చినది.

మరల సంజవేళ నేడు గంటలన్నరకు నేను వారి సన్నిధి కేగితిని. నేను చేరబోగానే నమస్కార ముద్రతో నున్న నా రెండుచేతులను బట్టుకొని కన్నులనానంద బాష్పములురాలగా లేచి కూర్చుండి---

'ఉదయముననెన్ని గంటల వేళ మీరింటికి వెళ్ళితిరి?' అని అడిగిరి. ''అ దాదాపు పదిగంటలు కావచ్చినది. చాలసేపు కబుర్లతో గడిపితిమి. అంతలో మీరు సుఖ నిద్రా వశులయితిరి. కొంతసేపు ప్రతీక్షించి నేనింటికివెళ్ళితిని'' అంటిని.

''మీరు ముచ్చటించుచుండ గానే నిద్రా వశుడనయితిని. ఎంత సేపో చాలసేపు నిద్రించితిని. నిద్రలో నోరు తెరపియయి నోటనే యుచ్ఛ్వాస నిశ్వాసములు సాగుటచే గొంతుక పొడి యారి పోయినది. నోట తడి లేకపోయెను. మెలకువ గొంటిని. చప్పరింపబోగా చప్పరింత పడదు. మంచినీరు త్రాగవలెను. ఇటు నటు జూతును కదా యెవ్వరును కానరారయిరి. ఎప్పుడును సన్నిధి నుండి పరిచర్య చేయు చుండు నా భార్య దగ్గర లేదు. సర్వదా నా దగ్గర నుండు నౌకరు గానరాడు. ఆగజాలక పోయితిని. పొడి యారిన నోటితోడనే యెట్లో కొంత బిగ్గర గానే పిలిచితిని. ఎవరునూ రాలేదు. చేతులతో చప్పట్లు సలిపితిని. లాభము లేదయ్యెను. ఇట్లు కొన్ని నిమిషాలు తంటాలు పడితిని. ఎవ్వరునూ రాలేదు. కన్నులును తడియారి పోవుచుండెను. చూడజాలకుంటిని. ప్రాణములు నిలుచునట్లు లేవు. స్మృతి తప్పినట్లున్నది. ఇంతటి మహాసౌధము, ధనసంపద, స్వజన సంపద, ప్రాభవము సర్వము నన్ను కాపాడజాల వగుట స్పష్టమయ్యెను. గ్రుక్కెడు మంచినీళ్ళిచ్చి ప్రాణము రక్షించుటకివి యేవియు పనికిరాక పోయినవి! ఇప్పుడు నాకు దిక్కెవ్వరు? వెలుపలి వారినెవ్వరిని బిలువ గలను? నా యార్తాలాపము లెవ్వరికిని వెలుపలి వారికి వినబడకున్నవి.

...ంతర్యామీ! పరమేశ్వరా! నీవే కాపాడవలెను. నీకిదే శరణాగతి.
...కొన్నంతలో ప్రొద్దుట మీ ముచ్చటలోని శ్లోకము 'అనన్యసాధ్యే స్వాభీష్టే
... విశ్వాస పూర్వకమ్, తదేకోపాయతా యాచ్ఞా ప్రపత్తి శ్శరణాగతిః'
...ృదియు, దాని యర్థమును నంతరంగమున తాండవించు చుండుట
...రించెను. తన్మయుడనయితిని. పోతన్నగారి పద్యమిది. అంతట
...తరంగమున సినిమాబొమ్మ వలె తోపసాగెను.

లావొక్కింతయులేదు ధైర్యము విలోలంబయ్యెఁ బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను మూర్ఛ వచ్చెఁ దనువున్ డస్సెన్ శ్రమం బయ్యెడిన్
నీవే తప్ప నితఃపరం బెరుఁగ మన్నింపందగున్ దీనునిన్
రావే ఈశ్వర! కావవే వరద! సంరక్షించు భద్రాత్మకా!

అంతే ఒడలెరుఁగను.

ఎంతసేపు గడచినదో! ధ్వని విని మెలకువ గంటిని. నోర నుమ్మి నీరు
...ండి యున్నది. దాహము తీరినది. అంతరంగము, బాహ్యశరీరము ప్రేమ
...సార్ద్రమైనట్లున్నవి. ప్రసన్న భావముతో కనులు తెరచితిని.

నా భార్య వెండిగిన్నెలతో నాకాహార పదార్థములను, మంచినీటిని దెచ్చి
...ల్లపై బెట్టి(ఆ గిన్నెల బెట్టునప్పటి చప్పుడుతోనో, యామె రాకచప్పుడుతోనో
...ాకు మెలకువ వచ్చినది) నా మెలకువను బ్రతీక్షించు చున్నది. నౌకరు నా
...ట్టలను నుదికి తెచ్చి అప్పుడే యారగట్టుచున్నాడు.

'నాభి దగ్గర నుండి నాలుక డాక తడియారి యెండిపోయిన నా
...ోరనప్పుడు జాల్వారినది ఈశ్వర కరుణామృతము గాక యింకేమగును?
...న్నప్పుడు పెన్నిధియై, బంధువై, వైద్యుడై యాదరించి రక్షించినది ఆ
...గవంతుడు గాక మరెవ్వరు?

'ఇర్వురము నానందమయుల మయితిమి!'

ఇది కథకాదు–సత్యముగా జరిగిన సంగతి.

ధనసంపాదన తత్పరత్వమున వంతల్ సెంద; నుద్యోగపు
బెనుపుల్ వొందఁగ వందుఱన్; సుకవితావిద్యావిశేషమ్ముల
ఘనతం గోరి తపింప; నీపయి జగత్కల్యాణమై పొల్చు నీ
యనవద్యస్థిరసత్కృపాగరిమమే యర్థింతు నాత్మేశ్వరా!

కవితాపట్టముఁ గట్టుకోఁ దొలుత పేడ్కల్ రేగె నాకుం, గృతుల్
చివురొత్తెన్ వెస మోము మొత్తె నిఁక నాచేఁ జెల్ల వీ కల్ల బొ
ల్లి వినోదంబు లివే జరామరణముల్ చీడల్ హతం బార్చి పు
ట్టువు చెట్టున్ సఫలీకరించుకొని యంటుల్ గట్టెదన్ మాలినై.

# 17. మహాత్ముడు-ప్రార్థనము

మంగళం గంధయే లోక, మంగళార్థ ప్రవృత్తయే.
అసహాయోద్యమ స్థాప, నాచార్యా యాస్తు మంగళమ్.

కాయేన వాచా మనసేంద్రియైర్వా
బుద్ధ్యాత్మనా చైక విశుద్ధ వృత్తయే;
సుదర్శనా యాత్మ విదే మహాత్మనే
సుస్వాగతం మోహనచంద్ర గంధయే.

భగవంతుడు కలడనీ, ఆయన కరుణా సముద్రమనీ, మనకు ఇప్పుడీ క్లేశములు గా తోచునవి కూడా మన క్షేమమునకే భగవంతుడనుగ్రహించె ననీ, గుర్తింపనిచో మనము త్రాడుతెగిన గాలిపటము వంటి వాళ్ళము కాక తప్పదు. భారతదేశమున దారిద్ర్యసాగరం పొంగులు వారుటలోనే మోహనదాస కరుణా సాంద్రుడను చంద్రుడుదయించినాడు. ఈ దారిద్ర్య సంక్షోభము లేకున్నచో భారత వర్షము సత్యాహింసాత్మకమైన మహా తపస్సు చేయదు. సంపన్నుడైయుండ తగిన మహాత్ముడు లోకము నకై సర్వస్వము త్యజించి దారిద్ర్యమును వరించినాడు. ఇప్పుడు సంపన్నుల యైశ్వర్యమంతా ఆయనదే. ఆయన కావలెనంటే కనక వర్షం కురుస్తుంది. ఆయన వలె మనము కోరి తెచ్చుకోజాలక పోయినప్పటికీ లభించిన దారిద్ర్యములో గుర్తింపదగిన గుణ విశేషములను గుర్తింతము గాక.

## మహాత్యాగి – మహాత్ముడు

మహాత్ముడు నిష్కళంకుడయిన అహింసా తత్పరుడు. అయినా, అజ్ఞానహృదయు లంతా ఆయన మూలాన్నే 1942 ఆగస్టు దౌర్జన్యము కలిగినదని తలచినారు. ఆయనకు బంధనము కల్గించినారు. తన నైర్మల్యమును

విశ్వసింపని వారికై వగచి భగవదంకితముగా సత్యాహింసా ధర్మ ప్రతిష్ఠ
నిరశన వ్రతము సాగించినాడు. రాముడు, సీతా త్యాగము చేసినట్లు
మహాత్ముడు ఆహార త్యాగము చేసినాడు. ఉత్తరరామచరిత్రము
పంద్రెండేండ్లకు లోకం తత్తరించినట్లు, ఆయన పంద్రెండు రో
ఉపవాసమునకే లోకము అట్టుడికినట్టుడికినది. ప్రపంచ మానవ
దయమెల్లా తత్ప్రాణరక్షణకై పరితపించినది. భగవంతుని ప్రార్థించినది. అ
హింసా కారణమని, ఆయనను హింసింప దలచినవారు కూడా, ఆయ
యపాయము వల్ల యేమి మూడుతుందో అని మరల ఆయన క్షేమము
అర్థింప వలసిన వారైరి. మూడు నిముషములపాటు ఊపిరి కూడా ని
పోయింది. విశ్వ మానవ ప్రార్థనమే, భగవదనుగ్రహమే, ఆయన సత్యాహిం
తపో బలమే, ఈ యన్నింటి యైక్యమే ఆయనకు మరలా ఉసురు పోసిం
మందా! మాకా! ఆహారమా! ఏమీలేదు. ఏమీ లేకపోయినా
భగవదనుగ్రహమే, ఆ ప్రజా ప్రార్థనమే, ఆ ఆత్మబలమే, ఆ యన్నింటియై
మరి పదకొండు నాళ్ళు, ప్రాణశక్తిని ప్రబల పరుస్తూ, ఆయనను
త్యుంజయుని గావించినది. లోకమంతా సరిగా గుర్తింపజాలకున్నది.
మహాత్ముని అహింసా సత్య ధర్మములే, ఆయన ప్రార్థనమే విశ్వమం
యికమీద వెల్లివిరియ నున్నవి!

ప్రపంచ మానవ హృదయ మత్స్యముల మీద ఆయన ద్వారా భగవం
ప్రేమ జాలమును విసిరినాడు. సత్యము, అహింసా అన్న ఈ
సూత్రములనే ముడిచి, ముడిచి తయారుచేసిన వల అది! మడుగుల
దేశ,జాతి, మతాది పరిచ్ఛేదములతో ఇగిరి ఎండిపోతూ ఉండే, మాన
దయ మత్స్యములను ఈ వలలో పట్టియెత్తి, యెన్నటికీ ఎండిపోని స
సామరస్య మహాసముద్రములో ఆయన చేరుస్తున్నాడు. మేమీ
తగుల్కొనమనీ, తప్పించుకొంటామనీ, మమ్మేదీ పట్టజాలదనీ, తొలగి

జాతి, మత వర్ణ దేశాది పరిచ్ఛేదము లనే మడుగులలోనే, కాల్వల లోనే కొందరు దాగి తప్పించుకొన జూస్తున్నారు. సహృదయ మానవ ప్రవాహమున్నచోట్ల నెల్లనూ ఈ వలవాటు తగిలియే యున్నది. ఎన్నటికైనా అందఱూ సహృదయులైఅందులో చేరక తప్పదు. ఇప్పటికే దీని ప్రవాహము ప్రపంచము నూగిస్తున్నది. ప్రపంచ ప్రజా హృదయ సముద్ర మథనములో చెలరేగిన కాలకూట జ్వాలలన్నట్లు 'వి' బాంబులు, 'ఆటం'బాంబులు వగైరా మారణోపకరణములు చాలా లోక ధ్వంసము కావిస్తూ చెలరేగి ఉన్నా, వీని మూలమున ప్రళయమే వస్తుందేమో అని వెఱపు కలుగుతూ ఉన్నా, మహాత్ముని సంకల్ప దివ్యామృతము ప్రజాహృదయ సముద్రము నుండియే సర్వతోముఖముగా పొడమి, పొంగారి పొర్లువారి వస్తూ ఉన్నది. జాతి బంధములు, దేశ బంధములు, మత బంధములూ ఇక నిలువ జాలవు. సీజ్‌ఫ్రీడ్ లైనులూ, మాగ్నేట్ లైనులూ, చీనా గోడలూ, ఖండముల ఎల్లలూ, రాజ్యముల హద్దులూ, సముద్రముల మేరలూ కొన్ని తునాతునకలై పటాపంచలై పోయినవి. ఇంకా మిగిలినవి పోతున్నవి, పోతాయి. మనలోని దురహంకారము యొక్క స్వరూపాలైన ఈ పై భేదాలన్నీ వినాశానికే దారితీస్తాయి గానీ, లోక కల్యాణాన్ని ఎప్పుడూ సాధించలేవు. సాధించగల్గినదెల్లా ఒక్క స్వచ్ఛమైన ప్రేమ తత్త్వమే. గంధి ప్రతిపాదించే ప్రేమ, సత్యాహింసలు మాత్రమే లోకాన్ని యెప్పటికైనా ఉద్ధరింపగలవు.

## మహాకవి–మహాత్ముడు

నిజముగా మహాత్ముడు అలౌకికానుభవములు గడించిన మహాకవి యని నేననుకొంటూ ఉంటాను. ఆయన కొన్నికొన్ని సందర్భములలో వ్యవహరించిన చిన్ని చిన్ని వాగ్వ్యవహారములు కూడా మహాకావ్యములన తగినవిగా ఉంటవి. మచ్చుకు ఒకటి.

నా యజ్ఞానావరణము

నలిగులి చేయుము తండ్రీ!

కడపట ఉపవాస సమాప్తి సమయంలో ''నన్ను సత్యం ముందుండి నడిపిస్తూంది'' అని గంధిగారు చెప్పినారు. సత్యం, సత్యగర్భితుడైన గంధి ముందుండి నడిపించడం మనం గుర్తుంచుకోవాలి. ప్రతి ధర్మసందేహం లోను 'ఇలాటపుడు గంధిగారు ఏం చేస్తారో' అని మనం యోచించి చూచుకోవాలి. తెలియకపోతే ప్రార్థనలలో ప్రార్థించి చూడాలి. ఈశ్వర ప్రార్థనలు లేకపోతే నాస్తికుల మవుతాము. గాంధీజీని అనుసరింపదలచే వారు అతిముఖ్యముగా పాటింపవలసినది భగవత్ప్రార్థనము. గంధి అనుయాయులు పలువురు గాంధిగారి వెలుగే మాకు దారి చూపుతున్న దంటున్నారు. గాంధీజీకి దారి చూపిన వెలుగు భగవత్ప్రార్థనము.



''శరీరమనే బ్రహ్మాండాన్ని పరిశోధించగా తేలిన పరమార్థమే ఈశ్వరుడు. విశాల విశ్వాన్ని సంగ్రహించుకొని పోగా, కుంచించుకొని పోగా,పోగా మిగిలే ''పాయింటే'', పరమాణువే ఈశ్వరుడు.''

# 18. తప్పు దిద్దుకోవాలి!

శ్రీ మద్రామాయణంలో 'స్మిత పూర్వాభిభాషీచ పూర్వభాషీ చ రాఘవః' అన్నది చదివినప్పటి నుండీ, నాకు వివేకం కలిగినప్పటి నుండీ ఎంతో తంటాలు పడుతూనే ఉన్నాను. కానీ, ఒక జబ్బు నా కింకా కుదర కుండానే ఉంది. కోపం వచ్చి అది దీర్ఘకాలం ఉండి అది చెడ్డపనులు చేయించడం లేదు కానీ, అయినా దబీల్న కోపం వస్తుంది. అంతలో పోతుంది కూడా. అది రావడమే తప్పుకదా! చల్లని మాటలే రావద్దూ? కొందఱు పైకి నవ్వులు, లోపల నొవ్వులుగా ఉంటారు. అది నాచేతగాదు. లోనెంతో బైటా అంతే. అంతేకాదు. పైకి హాటుగా, లోన స్వీటుగా ఉంటాను. నాలోనూ ఎంతో చెడుగు ఉన్నదన్న మాటేగా?

స్కూళ్ళలో టీచర్లు కొందరు విద్యార్థులను కొడతారు. విద్యార్థుల మేలుకే అట్లా చేయడమంటూ అపలాపిస్తారు కూడా! పంతుళ్ళ కోపంలో మూడొంతులు వారి దురుద్రేకపు దురద తీర్చుకోడానికే కాని విద్యార్థుల మేలుకు కాదు. జరిగిన విషయమే ఒకటి-

తిరుపతిలో కోతులెక్కువ. పిల్లలకు వాటి సహవాసం! కొట్టేవాళ్ళను చూస్తే కోతులెక్కువ గోలచేస్తాయి. మంచి బుద్ధిమంతుడే, అయితేనేం మావాడొకడు హైస్కూలు టీచరు. పిల్లల్ని కొట్టేవాడు. ఒకనాడు కొట్టి కోప్పడితే పిల్లలు గోల చేశారు. అంతట అందర్నీ చితక గొట్టినాడు. మరీ అల్లరి. సాయంకాలం అతడింకా రాకముందే ఆ అల్లరి వార్త నా దగ్గరికి పరుగెత్తుకు వచ్చింది. నాకూ కాస్త కోపం గలిగింది. గనుక, పదిమంది ముందర విదలించి అడిగినాను. 'కొట్టకుండా ఎట్లాగండీ' అని తన్నేదో సమర్థించుకో బోయినాడతడు. మాట్లాడకుండా మందలించినాను. పిల్లల్ని కొట్టినట్టు నన్ను కొట్టజాలక కొలకొల లాడుతూ కోపోద్రేకంతో ఇంటికి వెళ్ళి పోయినాడు. రాత్రి నిద్ర

"జనరల్ డయ్యరు నన్ను రాజద్రోహియని చంపుటకు ఆత్రపాటున రివాల్వర్ గురిచూచుకొంటూ దూకుడుతో అపమార్గమున వస్తూ ఉంటే- ఆ త్రోవలో పాము అతని కాలు చుట్టుకొని కాటువేస్తూ ఉంటే- అతడు దానిని చూడను గూడా చూడజాలని స్థితిలో నా మీదకే దూకుతూ ఉంటే- అంతా చూస్తూ నేను నిర్భయముగా వాని దగ్గరకు వెళ్ళి పాముకాటు విషమును నోటితో పీల్చి యుమిసి వాని ప్రాణముల కాపాడుదును. పామును చంపను. ఇది నా అహింసా సిద్ధాంతపు పరమ లక్ష్యము".

--------

## మహాతపస్వి – మహాత్ముడు

ఆయన దివ్యబోధములలో మిక్కిలి ప్రధానమయినది ఈశ్వర ప్రార్థనము. ఆర్యజాతికి అనాదికాలము నుండి సాయంప్రాతః సంధ్యా వందనములు జీవగర్రలు. ఆ సమయముందలందీశ్వర ప్రార్థనము మహా మహిమగలదని యార్యుల విశ్వాసము, అనుభవము:-

గంధికి రెండు ప్రార్థనములు నుచ్ఛ్వాస-నిశ్వాసముల వంటివి. వీనిని విడచి ఆయన జీవింపజాలడు. పదింబదిగా ప్రార్థన మాహాత్మ్యమును ఆయన ప్రజలకు ప్రబోధించుచుండును. తనలో నేదేని విశేషమున్న నది ప్రార్థన మూలమున బడసినదే యని చాటుచేయక చాటిచెప్పును. ఆయన అసత్యములాడు వాడు కాడని ఎల్లరూ అంగీకరింతురు గదా!

సర్వకర్తయౌ ఈశ్వరేశ్వరుని దివ్య
తేజము వరేణ్యమును, వినుతింతు మెపుడు
ఇదిగదా లోననుండి మాకెపుడు మంచి
మంచి నుద్బోధముల నొదవించుచుండు.

పై పద్యమునర్థమే యార్యుల ప్రాతస్సాయం సంధ్యలలో జేయు ప్రార్థన

మంత్రమున కర్థము. ఈశ్వరుడు అంతర్యామిగా, శరీర గుహాంతర్వర్తిగా ఉన్నాడు.

'యోన్త స్సుఖోన్తరా రామ స్తథాంత ర్జ్యోతి రేవ యః,

స యోగీ బ్రహ్మ నిర్వాణం బ్రహ్మభూ తోధి గచ్ఛతి.

అని భగవద్గీత యన్నట్టు శరీరారామమున, లోనికి విహరింపజొచ్చిన నానందానుభూతి, జ్ఞానానుభూతి కలుగగలదు.

అన్ని మతముల వారు ఉభయసంధ్యలందును సంధ్యావందనముల జేయుచునే ఉన్నారు. ఆ చేయు పద్ధతులలో కించిద్భేద ముండవచ్చును. గానీ, అందరూ కోరే పరమార్థ మొక్కటే. గంధిగారు తాను సంధ్యా వందనం చేస్తూ, వేలకొలది జనులతో ప్రతిదినము సంధ్యావందనము చేయించుచున్నారు. ప్రపంచ దౌర్భాగ్యమునకు విముక్తి ఇట్టి ప్రార్థనముల మాహాత్యము వలననే కలుగవలె ననుచున్నారు. పై సంధ్యామంత్రార్థమును చక్కగా ధ్యానించి కనులు మూసుకొని కొన్ని నిమిషములు అంతరా రామమున విహరించుచు నెమ్మదిగా కూర్చొన్నచో దివ్యోద్బోధములు గంధికి బోలె ఎల్లరకు కలుగ గలవనియే విశ్వసింప తగును. గంధి యోగ్యత మన కేదీ! అనతగదు. తనకాయోగ్యత ప్రార్థన మూలముననే కలిగినదని గదా ఆయన అనుచున్నాడు.

అద్దమువలె దేహంబిది  
యమలినముగ జేసికొని  
శుద్ధపు నీ తేజము జగ  
దుద్దీప్తము జేయగదే!  
స్వామీ యంతర నిలయా!  
స్వయం వ్యక్తమై వెలయ

పట్టక పోవడంచేత అతనికి దోమ కుట్టినట్టు తెలియ వచ్చింది. ఈడ్చి కుడి జబ్బమీద కుట్టుతున్న దోమను ఎడమచేతితో చరచినాడు. చరపుకు ముందే దోమ దూసుకు పోవడంతో ఎప్పుడో పదేండ్లనాటి పాత డిస్లొకేషన్ అయిన జబ్బ మళ్ళీ జారిపోవడం జరిగింది. కళ్ళు తిరిగినాయి. ఎట్లో సర్దుకొన్నాడు. నిద్ర రాలేదు. స్కూలు పని మిగిలి ఉంది. నా డాదివారం. పని అంతా ముగించాలని ఉదయం కాంపోజిషన్ పుస్తకాల కట్ట దిద్దుతుండగా రెండేళ్ళ తనబిడ్డ వచ్చి ఫౌంటెన్‌పెన్ సిరాబుడ్డి బోర్లించి సిరాతో పుస్తకాల నభిషేకించింది. ఈడ్చి వీపుమీద చరచినాడు. పిల్ల స్పృహ తప్పి పడిపోయింది. ఒళ్ళు నల్లబారింది. అత్త, ఆలు ఇంట్లో అన్నం తింటున్నారు. వారికి తెలియకుండా పిల్లను భుజాన వేసుకొని నా దగ్గఱకు పర్వెత్తుకు వచ్చాడు. ఏడ్చాడు. పిల్లను ఒళ్ళోకి తీసుకొని, నేనూ దుఃఖించి, స్పృహ రాగా అప్పగించినాను. నాటితో సరి మా శిష్యుని కోపోద్రేకపు కొట్లాట. అప్పట్నుంచీ పిల్లలు అల్లరి చేస్తే, కోపంవస్తే, తన పసిపాప కథ ప్రత్యక్ష మౌతుందట! చక్కబడ్డాడు. తడిసి గుడిసె కట్టినాడు. ఈలాగంటి అప్పులు చుట్టువారి ఉండడం చేత నేనూ, నావల్ల వారూ తప్పులు గుర్తించు కొంటూ, దిద్దుకొంటూ ఉంటున్నాము.

గీ. నేను కారణముగ నెవ్వడేని సంక
టం పడని రీతి నన్ను వర్తింపజేయు
మాగ్రహ ఘసూయ గర్వ మిత్యాదులయిన
చెడుగు లుడిగింపు మిక నన్ను జెందకుండ.

నేనను నాయధమాధమ
నిర్వాహము తొలగించి
నీలో నను గలుపుకొని
నెగడగదే పరమాత్మా.

# 19. పెందువోని మందు

శ్రీహరి పాదతీర్థమే చెడని మందు
మోహ పాశాలు గోసి మోక్షమిచ్చేమందు ॥పల్లవి॥
కారమై కంటగించని కడుఁ జల్లనిమందు
నూఱని కాచనియట్టి నున్ననిమందు
కోరికతో వెలవెట్టి కొని తే వల్లనిమందు
వేరువెల్లంకులు కూర్చనట్టి పెందువోని మందు ॥శ్రీహరి॥
గురుతైన రోగములు గుణము చేసే మందు
దురితములు పెడఁబాపే దొడ్డమందు
నిరతము బ్రహ్మాదులు సేరుపుతో సేవించే మందు
నరకము సారనట్టి నయమయిన మందు ॥శ్రీహరి॥
పొంకముతో భయములు పొందనియ్యని మందు
మంకు బుద్ధులు మాన్పి మన్నించే మందు
పంకజాక్ష వెంకట రమణ ప్రసన్నుని మందు
సెంకించక తనదాసులఁ జేపట్టేమందు ॥శ్రీహరి॥

మధ్యాహ్నం ఆఫీసులో తాళ్ళపాకవారి సంకీర్తనలు పరిష్కరిస్తూ వుంటే పై కీర్తన చదివేటప్పటికి నాలో వింత 'యాక్షన్' జరగటం మొదలు పెట్టింది. ఆ కీర్తన మనలైను నుద్దేశించి వ్రాశారా? అనిపించింది. మనమంతా యేమి చేస్తున్నాము? మన శరీరంలోపల ఏమి జరుగుతుందో తెలియదు. కొంచెం బాధ రాగానే ఏదో కొంచెం మందును గొంతులో పోస్తున్నాము. తెలియని శరీర యంత్రంలో, తెలియని మనం, తెలియని మందును, తెలియని మోతాదుతో ప్రయోగించి గ్రుడ్డి యెద్దు చేనబడ్డట్టుగా ఆరోగ్య విషయాలలో యాత్ర సాగిస్తున్నాము. అన్నమాచార్యులన్నట్లుగా మనము నిజముగా స్వామి యాజ్ఞానువర్తులమై శరణాగతులమైతే ఆయన మనలను రక్షించుటే

కాక, మన ద్వారా లోకాన్నంతా రక్షింపగలడు. స్వామి వైభవం హిందువులలో పొరపులు, తెరలు, దూరస్థితులు లేకుండా సర్వానుభోగ్యమయ్యే స్థితి యిప్పటికియేర్పడింది. ఇంకా ఉండే అభ్యంతరాలను మనము తొలగించుకో గలిగితే బాహ్యముగా మహమ్మదీయులు, ఆంగ్లేయులు వారు వీరేమి సర్వ ప్రపంచవాసులు వచ్చి ఆ స్వామిని సేవించే వాంఛితార్థాలను తీర్చుకొనేకాలం త్వరలో వస్తుంది.

పూర్వము అనేకౌషధాలకీ, ఏ వైద్యాలకూ లొంగని రోగాలకు 'అగ్ని వైద్య మతః పరమ్' అని అగ్నిరక్షలు చెప్పబడినవి. వానికి బదులు ఇప్పుడు ఇంజక్షన్లు, సల్ఫనమేడ్లు, పెన్సిలిన్ వగైరాలు పుట్టినవి. ఇంకా పైపై పుట్టుచున్నవి. అగ్ని వైద్యానికి పైన ఎక్సరే, రేడియం, కాస్మిక్ రేలు వచ్చినవి. పై అన్నిటికంటే (సెల్ఫురే)ఆత్మతేజము ఉత్తమమైన దివ్యౌషధము.

కాబట్టి అమాయకంగా దైవాన్ని ''తండ్రీ! కాపాడుము. ఈ బాధల నుండి రక్షింపుము'' అని కోరడంలో డోసెక్కువ తక్కువలు లేవు. ఫలానాసమయంలో నని కాలనియమాలు, నిబంధనలూ లేవు. భగవంతుని యెడ 'త్వమేవ శరణం...' అన్న భావంతో ఉంటే సరి.

'ఈ శరీరానికి ఆపదలను తొలగించు తండ్రీ!' అని కోరుకొనే దెందుకు? అయితే! ఈ శరీరము ఇతరుల కపకారం కలిగించుటానికా! కాదు. చుట్టూ ఉన్నవారికి ఏదో ఉపకారం జరుపటానికే, మనము పొందే ఆనందమును, ప్రేమను మన చుట్టూ వెదజల్లటానికే! ప్రక్కవారికి సర్వీసు చేయుటవల్లనే మనకు కొంత శాంతి చేకూరుతుతుంది. సౌఖ్యమూ కలుగుతుంది.

పాప సంకల్పముల నెల్ల భస్మపరచి
శుభసమృద్ధి గల్పించి విశుద్ధమైన
పదముపై కోర్కె నెదలోన గుదురుకొలిపి
నన్ను కాపాడుమో గురునాథమూర్తి!

'మందుసంగతీ నాకు తెలియదు. ఈ మందుల నుపయోగించే సంగతీ నాకు తెలియదు.

# 20. సత్యజ్ఞానానందములు

సత్యజ్ఞానానంద స్వరూపుడు ఈశ్వరుడు. ఆ పదార్థాన్ని ఇంత వరకెవరూ ప్రత్యక్షంగా చూడలేదు-తెలుసుకోలేదు. దానిని చూడాలనీ, తెలుసికోవాలనీ ఈ సృష్టి ఆది నుండి అందరూ ప్రయత్నం చేస్తూనే ఉన్నారు. ప్రతీజీవీ ప్రతిక్షణం తెలిసో, తెలియకో ఏతత్సాన్నిధ్యానికై ప్రయత్నము చేస్తూనే ఉంది. సత్యము నిత్యమైనది. నిన్న ఉండి నేడు లేక పోలేదు. నేడుండి రేపటికి లేకుండా పోదు. అలా పోవునదేదీ సత్యము కాదు. నిన్న, నేడు, రేపు అనే కాల నియమాల కతీతంగా శాశ్వతంగా వుండేదే సత్యము. అదియే ఈశ్వరుడు.

కానీ మనలో నిన్న ఉన్నవాడు నేడు లేడు. నేడున్నవాడు రేపటి కుండడం లేదు. మనం ప్రతిక్షణం ఉండటానికే ప్రయత్నం చేస్తున్నాము. ప్రమాదం సన్నిహితమైనపుడు మానవులు, పశు పక్ష్యాదులు అన్నీ ప్రమాదం (మృత్యువు) నుండి తప్పించుకొని బ్రతుకుటకే ప్రయత్నిస్తున్నాయి. కాళ్ళూ, చేతులూ లేకపోయినా వ్యాధులతో మూల్గుతూ ఉన్నా, ఆఖరుకు మంచానపడి కుష్టు, క్షయ మొదలగు మహాఘోర వ్యాధులతో పీల్చి-పిప్పి చేయబడి, ఏ సుఖమూ, ఏ ఆనందమూ లేక పీడింపబడుతున్నా, ఆఖరిదశలో కూడా ప్రతీ ప్రాణీ-యింకా బ్రతకాలని కోరుకొంటుంది.

------------

## జ్ఞానము

మానవుడు నిత్యంగా నిలిచే యోగ్యత సంపాదించినప్పటికీ జ్ఞాన హీనుడై బండరాయిలా శాశ్వతంగా ఉండి యేం ప్రయోజనం? అందువల్ల ఎటర్నటీకి తోడుగా జ్ఞానముండాలి. నాకు కొంతవరకు జ్ఞానము ఉంది. మీకు అంతకన్నా

నిజంగా నా నిశ్చయం యేమిటంటే! ఈ గంధిగారి సంకల్పాలు శుభాంతంగా పరిణమించకపోతే అది భారతదేశ దౌర్భాగ్యానికే కాక, లోక కల్యాణానికే గొప్పముప్పు తేగలదు. ఇవి ఫలించక పోతే లోకం అంధకార బంధురమవుతుంది. అంతర్యుద్ధం వస్తుంది. ప్రజానాశనం పెరుగు తుంది. భగవంతుని ఉనికినే ప్రశ్నించ వలసి వస్తుంది. అటుపై నాస్తికత చెలరేగి పోతుంది. భగవద్విశ్వాసం ఫలించనపుడు అదేగతి కదా. నామట్టుకు నాకు ఇది శుభాంతం కాకపోతే జీవితేచ్ఛ లేదు.

-------------

లెవెల్

లెవెల్(LEVEL) అనే పదములోని అక్షరాలను మొదట నుంచి చదివినా, చివరనుంచి చదివినా ఒకే లెవెల్ అవుతున్నవి. అంటే సంఘంలో బ్రాహ్మణుల నుండి చండాలుర దాకా చూస్తే ఇప్పుడున్న క్రింది, మీది దశలు సమ మట్టము గా ఏర్పడవలెనన్నమాట! అట్లాగే లక్షాధికారుల నుంచి భిక్షాధికారుల దాకా, ప్రభువులనుండి నౌకరులదాకా ఉండే హెచ్చు తగ్గులు తొలగి సమమట్టమై అందరూ ఒక్కదశలో నిలువవలెనన్న మాట!

'LEVEL' అనే పదంలో మొదటి అక్షరం లార్డులను(ప్రభువులను), లెర్నెడ్ పీపుల్- అనగా విద్యాధికులను తెలుపుతుంది. కడపట ఉండే అక్షరం లేబరర్సును(అనగా నౌకర్లు), లో క్లాసు పీపుల్‌ను(నిమ్నజాతుల వారిని) తెలుపుతుంది. ఇంగ్లీషు పదములలో మొదటి అక్షరము కాపిటల్ లెటరుగా పెద్దదిగా ఉంచుతారు. అట్లాగే ప్రభువులు, విద్యాధికులు మీదనెక్కి పెద్దదశలో ఉన్నారు. నౌకర్లు, మాల-మాదిగలు చివరపడి దిగనాశిల్లుతున్నారు.

అంతా లెవలైనప్పుడు ప్రాక్పశ్చిమములు ఆద్యంతములు ప్రకృతి పురుషులు, ఆధ్యాత్మిక భౌతికములు ఐక్యము పొందగలవు.

సచ్చిదానంద స్వరూపుని
సకల జనకుని జనులు కనగల
రిచ్చు నా తండ్రియును బిడ్డల
కెల్ల సంపదలున్॥

హెచ్చు తగ్గులు తొలగి పోవును
చచ్చు బుద్దులు తొలగి పోవును
పెచ్చు పెరుగును జ్ఞాన సత్య
ప్రేమ సుఖము లిలన్.

# 21. ఆవేదన

తలప దలంపగా మది వితాకు జనించు జగమ్ము లీ గతిన్
గలుగుట కేమి కారణము? కల్గు ఫలమ్మది యేమొ? దీనికిం
దొలుతటియున్కి యెట్టిదియొ? తుట్టతుదం గనునో? యనేక రీ
తులు తులకింప హేతువు నెదో? యెది యెట్టిదొ? యేమి కర్మమో?

పంజాబు దేశం ఎంతో అందమయింది. సారవంతమయింది. అలాగే అక్కడి వారంతా చాలా సుందరం గానూ, సుకుమారం గానూ ఉంటారు. ఐదునదుల మధ్య ప్రదేశం అయినందున, ఏకొరతా లేకుండా అన్ని వస్తువులూ పుష్కలంగా లభిస్తాయి. కాన ప్రశాంతంగా ఉండే దేశం అది. అక్కడ ఇప్పుడు ఏమి జరుగుతూంది? పంజాబును తలచుకోగానే మనసంతా నీరవుతూంది! ఇంతటి సంపన్నులు, సౌందర్యవంతులు, సుకుమారులు అగు పంజాబీయులు ఇలా హఠాత్తుగా తమ మానవత్వాన్నే కోల్పోయినారేమిటి? నిన్నటి వరకు అన్నదమ్ములుగానూ, అక్కచెల్లెండ్రగాను ఉన్నవారు–ఈ రోజున ఏమీ దయ లేకుండా పెద్దపులులై ఒకరిపై నొకరు దూకుతున్నారు! చంపేస్తున్నారు! ఇళ్ళు వాకిళ్ళు తగులబెట్టి బూడిదపాలు చేస్తున్నారు! ఈ క్రోధానికీ, ఆవేశానికీ, దురహంకారానికీ దూరంగా ఉన్న పసిపాపలు, బాలబాలికలు కూడా దానిలో ఆహుతియైపోతున్నారు! ఎందరు చనిపోతున్నారో, ఎన్ని కుటుంబాలు ధ్వంసమవుతున్నాయో ఊహించగలమా? ఇలా తలచుకొంటే హృదయం ద్రవిస్తూంది! తూర్పు పంజాబు నుండి పడమటికి, పడమటి పంజాబు నుండి తూర్పుకు రోజూ కొన్ని వందలు– కాదు– కొన్ని వేలమంది పారిపోతున్నారు! తాత తండ్రుల నుండి నివసించే ఇండ్లను, గ్రామాలను వదలి, తల్లీ–తండ్రీ, అన్నా–చెల్లెలూ అనే సంబంధం లేక ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకొని

పెద్దపులి తరుముతూ ఉంటే పరుగులుతీసే లేడి గుంపుల్లా' వారు పారిపోతున్నారు. ఇదంతా చూస్తూంటే నాలో ఉన్న విశ్వాసాలన్నీ క్రింది పునాదుల నుండీ షేకవుతున్నాయి. సత్యము, అహింస, ప్రేమ, జ్ఞానము ఇవి అన్నీ ఏమయినాయి? అన్నీ వట్టి బూటకపు మాటలేనా? గౌతమ బుద్ధుడు, మహావీరుడు, క్రీస్తు మొదలగు మహాపురుషుల బోధలన్నిటికీ ఫలమిదా? గంధి మహాత్ముడు మన మధ్యలో ఉండి మనతో కలిసి మెలిసి తిరుగుతూ మనకు బోధించిన, బోధిస్తూవున్న ప్రేమతత్వం మనకిలానే అర్థమయిందా మనలో ఏదో ఒక దివ్యజ్ఞానం నెలకొన్నదనీ, మనం ఆ ఈశ్వర తత్వానికి దగ్గరగా పోతున్నామనీ భావించాము. ఏదో ఆశ పడుతున్నాము. కానీ మనలో నెలకొన్న దనబడే ఆ జ్ఞానానికి నిదర్శన మిదేనా? ఎన్నో వేల మంది ఇళ్ళూ, వాకిళ్ళూ కోల్పోయి బికారులు కావడం– ఇంకెన్నో వేల మంది హత్యలు చేయబడడం జరిగింది. ఇటువంటి ప్రళయాన్ని చూస్తూ– ఏమీ చేయలేక ఊరక ఉంటున్నాం! ఇంత అప్రయోజకులుగా జీవించడంలో సారస్యమేమిటి?



మానవుడు పరిపూర్ణత పొందాలని మనం కోరుతున్నాము. ఈశ్వర లక్షణమయిన ప్రేమ అతనిలో నెలకొని– దాని దివ్యప్రభల వల్ల చుట్టూ ఆనందం, ప్రేమ, జ్ఞానం 'రేడియేట్' కావాలని మనం కోరుకొంటున్నాము. కానీ ఇపుడు జరుగుతున్న దేమిటి? మానవునిలో ప్రేమకు బదులు, రక్తపిపాస వృద్ధిపొందుతున్నట్లు కనబడుతూంది! ఆ ప్రేమ తత్వానికి ఒక 'ఎగ్జాంపుల్' గా తీసుకోతగిన మహాపురుషుడు, సాక్షాత్తు ఆ ప్రేమతత్వమే అనతగినవాడు గంధి. మనలోని ఈ రాక్షసత్వానికి అడ్డువస్తున్నాడని చంపేశాం. నిన్నకాక మొన్నటి వరకు మహా భయంకరమైన యుద్ధంలో చిక్కుకొంది ప్రపంచము. అందువల్ల ప్రజలకు జరిగిన బాధా, కష్ట–నష్టాలూ, విధ్వంసమూ అంతా ఇంతా కాదు. ఆ గాయాలింకా మానలేదు కూడాను.

# 22. ముగింపు

శుక్రవారం సాయంత్రం జరిగిన సంఘటన.

అప్పటికి వారం రోజులుగా శ్రీ శాస్త్రిగారు చాలా తీవ్రమైన అనారోగ్యంతో బాధపడుతున్నారు. ఆరోజు మరీ ప్రమాదకరంగా వుంది వారి స్థితి. మేమంతా యేమవుతుందోననే దిగులుతో కృంగి పోతున్నాము. అట్టి స్థితిలో వుండగా సాయంకాలం ప్రార్థన సమయమైంది. అప్పుడు ఇంటి యజమాని వచ్చి, భార్యకు తీవ్రమైన తలనొప్పి, ఎన్ని మందులిచ్చినా తగ్గలేదు, ట్రీట్ చేయవలసిందిగా కోరారు. ''తలనొప్పి తగ్గకపోవటం ఏమిటి బాబూ! చూడండి ట్రీట్ చేస్తున్నాను'' అన్నారు శాస్త్రిగారు. ప్రక్కనే ప్రార్థన సమయంలో కూర్చున్న డాక్టరుగారు వారించారు. 'ఈ స్థితిలో మీరిలాటి పనులు చేయకండి బాబూ!' అని.

చూడండి డాక్టరుగారూ! జీవితం ఇవాళ ఉంటుందో పోతుందో! పరులకు కష్టం కలిగినదని విని ఎలా ఊరుకోను నాయనా–మన జీవిత పరమార్థం సాటి మానవ శ్రేయస్సే కదా! బాబూ నా దేహస్థితి యిలాగున్నా ఆ దివ్యశక్తి ఎలా పనిచేస్తున్నదో చూడండి–మీరుమాత్రం మాష్టర్‌గారిని మరచి పోకండి–'

మరుక్షణానికే ఆమెగారి బాధ నివారించిందని ఇంటి యజమాని తెలిపినారు.

నా చిత్తంబు పరీక్ష చేసుకొనుచున్నాడన్ యదార్థంబుగా
బోచంతైనను దుఃష్ప్రవర్తనము దుర్బోధం బెరుంగన్ బవి
త్రాచారంబున బ్రహ్మతత్త్వ పరమార్థానందముం గూర్చి యా
లోచింతుం బలవింతు జింతుంతు నేలో నన్ను పంచించుటల్.

కరుణామూర్తి; జగత్కుటుంబి; యత డిక్కెట్లన్ ననున్ ముంచునన్
వెఱ నాకింతయు లేదు; తన్మయత నే వేళం బ్రవర్తిల్లుదున్.
మరణం బిప్పుడు తప్ప దేనదియు సంప్రాప్తించు; లేకున్నచో
దొరకున్; నా పరితోషహేతు విట మీ ర్దుఃఖింపగా నేటికిన్.

వి. ప్రభాకర శాస్త్రి



శ్రీ. ప్రభాకర శాస్త్రి

**Sri Veturi Prabhakara Sastri**